# గెర్మన్ తితోవ్

## రోదసిలో ఒకరోజు గడిపిన తొలి మానవుడు





నొవొస్తి వార్తా సంస్థ విలేకరులు పావెల్ ...రషెవ్‌కూ, యూరీ దొకుచయేవ్‌కూ వివరింపబడిన సోవియట్ రోదసీ నౌకా చోదకుని ఆత్మకథ

...వియట్ భూమి అనుబంధం

...చిక 18 సెప్టెంబరు 1962

# విషయసూచిక



రోదసీ నౌక ఓస్టోక్–2 యాత్రా పథం

సోవియట్ భూమి 18వ సంచికకు అనుబంధం, సెప్టెంబరు 1962

# రోదసీ శకోదయం

విజయావకాశాన్ని ఆకళింపుకు తెచ్చుకోవడానికీ, సంపూర్ణంగా దాని భావోద్రిక్తతను పొందడానికీ ఆలోచనలన్నిటినీ పోగు చేసుకుంటే బాగుండు నేమోనని అనిపిస్తుంది. అయితే ఏకాగ్రతతో ఆలోచించకుండా ఏదో ఆపు తోంది. అదేమయ్యుంటుందో? ఒక మిడుత...కొండమీద పొదల్లో ఎక్కడో దాక్కునుంది అది. అకారణమైన, కఠినమైన అవమానంలాగా, కజక్ స్టెప్పీ అంతటా అది పదేపదే తన కలకాలపు పాటను పాడుతుంది. అదెందుకుందిక్కడ, అంత మొండిగా రొద చేస్తుందెందుకని—యిక్కడ యిటువంటి వ్యవహారాలు జరుగుతూ వుంటే?

పెద్ద రాకెట్టు పెట్టివున్న ఆ దూరపు చోటువేపు చూస్తుంటాను నేను. రజత వర్ణంతో, బ్రహ్మాండంగా, దూలాల ప్రాపు లేకుండా అది ఆ స్టెప్పీ మనోహర దృశ్యంలో చెక్కబడివుందేమో అనిపిస్తుంది—క్రూరమైన ఎండలో వివర్ణమయి యించుమించుగా ఆకాశంలో కలసిపోయి; సన్నని సంధ్యా కాంతి భ్రమలోనో, లేకపోతే భూమితో సంబంధాన్ని త్రెంచుకుని విశ్వ కుహరాలలోనికి దూసుకపోవడానికో కంపిస్తూ!

యూరీ ఉన్నాడక్కడ.

ఎందుకు, ఎందుకున్నాడక్కడ?

మేము కొద్ది మందిమి అక్కడ నిలబడివున్నాము, ఆ రాకెట్టు పంప బడే స్థావరానికి మూడు కిలోమీటర్ల దూరాన. ఉద్రేకం ఉచ్చ స్థాయిలో వుంది. ఏదో ఒకభారం మమ్మల్ని దిగలాగుతోంది, కాని అది భౌతికమైన భారం కాదు. యుగాలనాటి మానవజాతి చరిత్ర యావత్తూ మాకు వెనుకను నిలబడినట్టుగా వుంది, మమ్మల్ని నిశిత దృష్టులతో చూస్తూ మా జవాబు

కోసం ఎదురు చూస్తున్నట్టుగా. రాతి కత్తి దశనుండి మానవుడు యీ అపూర్వ ఉపగ్రహ నౌక దశవరకూ సుదీర్ఘమైన తన కష్ట యాత్ర కొరకు పడిన పాట్లన్నిటికీ, మేము ఏ విధమైన సంజాయిషీ చెప్పుకోబోతున్నాము? ఈజిప్టులోని పిరమిడ్లను కట్టిన లక్షోప లక్షల మంది అనామక బానిసల గాధలూ; గతకాలపు నిరీశ్వర వాదులైన మహాపురుషులు—ఆర్కిమెడిస్, కొపెర్నికస్, గలీలియో, బ్రూనో, లొమనసోవ్, న్యూటన్, కిబల్చిచ్, త్సియోల్కోవ్‌స్కి, యీ కాలపు డిజైనర్లు, సిద్ధాంత వేత్తల బ్రహ్మాండమైన దీక్షకూ, యోచనకూ సంబంధించిన గాధ లెటువంటివి? ఈ కొద్ది సెకండ్లలో—రోదసీ విమానాశ్రయంలో రాకెట్టును పంపబోయే బృందం అప్పుడే యీ సెకండ్లను వెనుకనుండి లెక్కబెడుతోంది...పది—ఏడు...మూడు...రెండు...ఒకటి అని—చరిత్రకు మేము యిచ్చే జబాబు ఏమిటి?

"పంపండి!"

"బాగుంది, బాగా జరిగింది" అంటూ నా స్నేహితుడు అనడం నాకు వినిపించింది. రిసీవింగ్ సెట్‌లో అది ఎంత మాత్రమూ అస్పష్టంగా లేదు. ఆయనకంటె నేనే యిది బాగా గ్రహించానేమో అనిపించింది—రాకెట్ యింజిన్ల రెండుకోట్ల అశ్వశక్తి అంతా, భూమికి ఆయనను బందీగా చేసి వుంచిన బంధాలను త్రెంచడానికి ఎంతగా కష్టపడి పని చేసిందన్న విషయాన్ని.

రాక్షస గర్జన, జ్వాల, పొగ, మళ్ళీ జ్వాల స్టెప్పీమీద దొర్లాయి. ప్రారంభ స్థావరంనుండి ఆ చుట్ట అతి బెదురుగా విడిపోయి, ఆకాశంలోనికి యిష్టం లేదన్నట్టుగా వెళ్ళింది. తరవాత దాని వేగం హెచ్చుడం మొదలయ్యింది. అదుగో అప్పుడే ఉజ్జ్వలమైన తోకచుక్క. ఇక అది చూపు కందకుండా పోయింది.

తరవాత ఇంజిన్ల గర్జన ఆగేక, ఏమీ పట్టించుకోకుండా చేస్తూన్న మిడుతల రొద నాకు వినిపించింది. కమ్మ తెమ్మెరలు మళ్ళీ ఉడ్ సెజ్ పూల ఘాటైన వాసనలనూ, వసంతకాలపు పచ్చిక బయళ్ళ సువాసనలనూ మోసుక వచ్చాయి. ఈ అనాది కాలపు స్టెప్పీలో సర్వమూ మార్పు లేకుండా వుండిపోయింది, యుగయుగాల బట్టీ. ఎక్కడో ఆకాశంలో మట్టుకు

మనిషి చేసిన నక్షత్రం ఓస్తోక్, నవశకోదయపు వేగుజుక్కగా శాశ్వతంగా మిణుకు మిణుకు మంటోంది.

యూరీతో బాటుగా మేము రోదసీ దుస్తులలో రోదసీ నౌకాశ్రయానికి వెళ్తోంటే, విజ్ఞాన శాస్త్రవేత్తలలో ఒకరు గగారిన్‌ను చూసి కావలించుకుని, ఒక్క పెట్టున ఏడ్చారు. యూరీ ఆయనతో కరచాలనం చేసి, పసి బిడ్డతో అన్నట్టుగా

"ఇప్పుడు, ఇప్పుడు అదుగో..."

అయితే నూట ఎనిమిది నిమిషాల తరవాత, ఆ విజ్ఞాన శాస్త్రవేత్త మళ్ళీ యూరీని కావలించుకుంటున్నారు. రోదసీ నౌకను పంపడానికి ముందర వున్నట్టుగానే యూరీ భూలోక వాసి. కానయితే యిప్పుడాయన రోదసిలో నుండి తిరిగీ వచ్చిన మనిషి. మా మిత్రుడు విజ్ఞాన శాస్త్రవేత్త మళ్ళీ ఆపులోక పోయారు...యూరీగాని, యింకెవరుగాని ఆయనతో ఒక పలుకైనా పలకలేదు_ఎంచేతనంటే మానవ మహా విజయంవల్ల కలిగిన ఆనంద బాష్పాలివి.

ఇప్పుడిక తేలికగా ఊపిరి పీల్చుకోవచ్చును. ప్రారంభానికి ముందర మామీద వున్న బరువు లేదిప్పుడు. ఎండపడుతూవున్న ఆ స్టెప్పీ, క్షితిజ రేఖకు ఆవలకు కూడా పరుచు కొని వుంది, రాకెట్ ఇంజిన్ల గర్జనను శాశ్వతంగా తనలో యిముడ్చుకుని వున్నట్టుగా.

మేము పరీక్షలో నెగ్గాము.

రోదసీ శకోదయం యీ తీరులో నాకు జ్ఞాపకం వుంది.

ఇప్పుడు మేమింకా చేయవలసింది ఎక్కువగా వుంది, యింకా వెళ్ళవలసి వుంది మున్ముందుకు.

ఆ రోజున జరిగిన ఘటనలు ప్రజల మనస్సులను ఎన్నాళ్లో ఉత్తేజపరిచాయి; స్వశక్తిలో, ఉన్నతిలో ఆనంద భావాన్ని కలిగించాయి వారికి. సోవియట్ రోదసీ నౌకా చోదకులయితే, తమ నిత్య కృషిని సాగిస్తూనే వున్నారు.

విశ్వం, యింకో భూలోకవాసి కోసం ఎదురు చూస్తోంది. అందుకు నేను నియమింపబడ్డాను.

# బొబ్రోవ్కా నదీతీర గ్రామం

ఆ నది పేరు బొబ్రోవ్కా. మా గ్రామానికి పక్కగా అది పారుతోంది. దాని నీళ్ళు శుభ్రంగా అద్దంలాగా వుంటాయి. దాని ఒడ్లంబట ఓసియర్లు ఎంతగా పెరిగిపోయాయంటే, కొన్ని కొన్ని చోట్ల అవి నదినే కప్పివేశాయి. ఈ పచ్చని గోడలేనిచోట నీటికి దిగువ యిసుక నేల కంటబడుతుంది.

ఆ చోట్లలో నీరంతగా వుండదు, అడుగు గట్టిదనంతో వుంటుంది, బండలు కెరటాలకు మధ్యగా కనిపిస్తాయి. పగటిపూట రాళ్ళు వేడెక్కిపోతాయి. సూర్యుడు మబ్బులవెనక దాక్కున్నప్పుడో, కమ్మని గాలి వీస్తున్నప్పుడో, మేము ఎంతో సేపు యీత కొట్టాకను వాటిమీద వేడికాగుదామనిపిస్తుంది. రాతిమీద ఆనుకుని పడుకుంటే, అది వేణ్ణీళ్ళ సీసాలాగా శరీరంలో వెచ్చదనం కలిగిస్తుంది; చలి వెన్నెముకలో పైకీ దిగువకూ పరుగులెత్తుతుంది. సూర్యుడు మబ్బులవెనుక ఎక్కడో వుంటాడు యింకా. తరవాత యిటునుండి అటు తిరిగి మళ్ళీ రాతిమీద పడుకుంటాము.

ఆ గుండ్రని రాతిమీద యిటూ అటూ తిరగడం విసుగెత్తుతుంది. వెచ్చదనం పుట్టింది గదా, మళ్ళీ నీట్లోకి యింకో ఉరుకు. అన్ని వేపులా గుడ్జియన్ చేపలను వెదజల్లుతాము. కాని అవి వెళ్ళడానికి చోటేదీ? మూక మూకంతా వెంటనే నీట్లోకి దుమికిందాయెను ఒక్క బిగిని.

ఇది ఆల్తాయ్ మండలంలోని సైబీరియాలో జరిగింది. ప్రపంచంలోని అతి చక్కని ప్రకృతి దృశ్యాలలో, యిది కట్టకడపటిది కాదని నా నమ్మకం. అక్కడి అడవుల్లో జంతువులు కొల్లలు, నదుల్లో చేపలు కొల్లలు, బయళ్ళలో సాటిలేని రకరకాల పువ్వులు. పరిశుభ్రమైన, యించుమించుగా

కొండగాలివంటి గాలి. ఆకాశం రక్తవర్ణంలో వుంటుంది, లేకపోతే ఇంచు మించు నలుపు రాత్రుళ్ళలో, వజ్రాల అన్ని వర్ణ ఛాయలతోనూ మెరిసే చుక్కల మాలల్తో. శీతకాలాలు బహు కఠినంగా వుంటాయి తుఫానుల తోనూ, హిమపాతాలతోనూ. కొండవాగుల్లాగా హఠాత్తుగా వచ్చి పడ తాయి వసంతాలు. అక్కడవుండే ప్రజలు నెమ్మదైనవారు, ధైర్యవంతుల్లు, ఒకరినొకరు గౌరవంతో చూసుకుంటారు, బ్రతుకుపట్లా తమ భూమి పట్లా అభిమానం గలవారు. అదీ నా దేశం.

నక్షత్రాలు. వీటిగురించి నేను తరచు మాటాడుతుంటాను. అయితే ఒక మినహాయింపు వుంది. మా ఆల్తాయ్ నక్షత్రాలు, రాత్రిపూట టెక్సాస్ పైనో జినోవా పైనో వెలిగే నక్షత్రాలవంటివే ననుకుంటాను. కాని ఏ కార ణం చేతనో పత్రికా రచయితలూ, రచయితలూ నేను పెరిగిన స్థలంగురించి నా జ్ఞాపకాలలోని యీ వివరాన్ని, పుట్టుకతోనే నేను రోదసీ నౌకా చోదకుణ్ని కాబోవడానికి గుర్తుగా వ్యాఖ్యానించారు. యదార్థం ఏమిటంటే బాల్యంలో వైమానికుణ్నవుతానన్న ఊహే లేదు నాకు. కాని దగ్గరగానూ, దూరం గానూవున్న గ్రహాలను, తమ చల్లని కాంతితో ప్రకాశించేవాట్ని అట్టేసేపు వింతగా చూస్తూ వుండిపోయేవాణ్ని. సాధించ నలవికాని పాల పుంత వేపు అమెరికాలోనూ, ఫ్రాన్సులోనూ, ఆఫ్రికాలోనూ లక్షోపలక్షలమంది కుర్ర వాళ్ళు చూసేటట్టుగానే నేను వాట్ని చూశాను.

1941 లో అరోరా బోరియాలిస్ కాంతులు చూసి, నేను కదిలి పోయేను. ఇది మా మండలంలో ఎన్నడూ కనిపించలేదు. ఇంద్ర ధనస్సు లోని రంగులన్నిటితో మెరిసిపోయిన ఆకాశపు అతి రమ్యమైన అందం నాకింకా మరపుకు రాలేదు. కాని యీ ఉత్తరాది దీపాలు కఠిన జీవితంలో భాగంగాగలిగిన ఆర్కిటిక్ అన్వేషకుణ్నవుతానని, నేను కలలో కూడా అనుకోలేదు. కాని నేనే అన్వేషకుణ్నయి హఠాత్తుగా ప్రసిద్ధిని పొంది వున్నట్టయితే, మా పత్రికా రచయితలైన స్నేహితులు అసాధారణమైన అరోరా బోరియాలిస్ కాంతులు వెలిగిననాడు నేను ధృవ మండల అన్వే షకుడు కావడం కోసం పుట్టానని నిస్సందేహంగా చెప్పివుండేవారు.

మా నాన్నగారి యిల్లు నాకు స్పష్టంగా జ్ఞాపకం వుంది.



రోదసీ నౌకా చోదకుడు గెర్మన్ తితోవ్ కుటుంబం. ఎడమ నుండి కుడికి: రోదసీ నౌకా చోదకుని తండ్రి స్తీపన్ పావ్లోవిచ్, ఆయన తల్లి అలెగ్జాండ్రా మిహైలోవ్నా, గెర్మన్ తితోవ్; ఎదుట: రోదసీ నౌకా చోదకుని సోదరి జెంఫిరా.

చలికాలపు సాయంత్రాలు కుటుంబంలోనంతమందితోనూ బల్లవద్ద కూచోవడం, మా నాన్నగారికి యిష్టం. ఆ రోజు జరిగిన సంగతులగురించి, మా అమ్మా నాన్నా మాటాడుకునేవారు. మా చిన్న చెల్లెలు జెంఫిరాను పడుకోబెట్టేసేరు. నేను పెద్దవాణ్ని, అంచేత నన్ను పక్కమీదికి తరమ లేదు, అవసరమయిందాకా. ఎప్పుడు పడుకోవాలో నాకు తెలుసు.

మా నాన్నగారు నన్ను తనతో సమానుడిగా చూసేవారు. మాటలు బడి గురించైనా, గ్రామపు క్లబ్బులో జరగబోయే ఉపన్యాసం గురించైనా, తమ "పెద్దవాళ్ళ" వ్యవహారాలలో నేను సైతం పాల్గొంటూ వున్నట్టుగా ఆయన ఎప్పుడూ మాటాడుతుండేవారు. ఆ సాయంకాల సంభాషణలంటే నాకు చాలా యిష్టం, మా అమ్మా నాన్నా చెప్పేదాన్లో చాలా భాగం నాకు అంతు దొరకనప్పటికీ. కాని సమానమైన హక్కులతో నేను కుటుంబంలో

సఖ్యాన్ని భావించుకోవడం వల్ల నాకు గర్వం కలిగేది, అన్నిటికంటె— నాకూ ఓ బాధ్యత వుందనుకునేవాణ్ని.

"నికొలాయ్ యీ వేళ బడికి రాలేదు. వాడికి సుస్తీగా వుందని పిల్లలంటున్నారు. వాడికి పాఠం తెలియక పోవడం మంచిది కాదు" అని మా నాన్నగారు విచారించేవారు. "చూడు, గెరా, రేపు మొదట యీ నోటు పుస్తకం వాళ్ళమ్మ దగ్గరికి తీసుకెళ్ళు. డిక్టేషన్‌లో వాడు చేసిన తప్పుల్ని నికొలాయ్ చూసుకోవాలి. నోటు పుస్తకం దాషా అత్తయ్యకియ్యి. ఆవిణ్ని వచ్చి నన్ను కలుసుకోమని చెప్పు. రయాన్ నుండి డాక్టర్‌ను పిలవ్వలసి వుంటుందేమో."

"తీసుకెళ్తాను."

"ఇవేళేం చేశావు?" అదే వ్యవహార సరళిలో మా నాన్నగారు అడుగుతారు.

"యూర్తాతోనూ, కుర్రాళ్ళతోనూ ఆడుకున్నాను......నాకు స్కీస్ కావాలి, శీతకాలం వచ్చేస్తోంది."

"చూద్దాంలే!"

ఒకొక్కసారి నాకనిపించేది—యిటువంటి పనులు చెయ్యమని నాన్నగారు నాకెందుకప్పగిస్తారని. దాషా అత్తయ్య బడిలో శుభ్రంచేసే పని కత్తిగా వుంటోంది; గంట కొట్టడానికి చాలా ముందరే ఆమెను మొట్టమొదట చూసేదాయనే. కాని నాన్నగారు చెప్పిన పని నాకు ఒక విధంగా పవిత్రమైనది. మర్నాటి ఉదయం మరీ యెక్కువ సేపు పడుకొని వుండిపోయి, యీ ముఖ్యమైన పనిని చెయ్యకుండా వుండరాదనే నా ధ్యాస.

అమ్మ, నాన్న మాటాడుతూనే వున్నారు, నేనైతే గడియారం వేపు ఓర చూపులు చూస్తున్నాను. అది నా చివర నిముషాల వేపుకు వెళ్తోందని అనిపిస్తోంది నాకు. నిద్రతో పెనగులాడుతూ మేజావద్ద సరిగా కూచోడానికి తంటాలు పడుతోంటే, ఏదో ఒకపనికి నేను అవసరమవుతున్నాను వాళ్ళకు.

అటువంటి శీతకాలపు ఒక సాయంత్రం నాడు, మంచు తుఫాను పెందరాడే ఆగిపోగా, అంతా సజావుగా వుండడం నాకు జ్ఞాపకం. గడియారం మాత్రమే బిగ్గరగా టిక్కు టిక్కు మంటోంది. నింపాదిగా మా

నాన్నగారేదో అమ్మతో మాటాడుతున్నారు. నల్లని మేఘాల సందుల్లోంచి వెన్నెల నేలమీదికి దిగుతోంది. చెట్లూ, ఒక చోటినుండి యింకో చోటికి జరుగుతూ పోయే మంచుదిమ్మలు ఊదా రంగు నీడల్ని వేస్తున్నాయి. అవి ఒకొక్కప్పుడు దట్టంగానూ, ఒకొక్కప్పుడు తళతళలాడుతూనూ కనుపిస్తున్నాయి. అవి ఒకొక్కప్పుడు పూర్తిగా అదృశ్యం అవుతున్నాయి.

ఈ నీడల క్రీడల్ని నేను శ్రద్ధగా గమనిస్తున్నాను. మా నాన్నగారైతే తన ఫిడేలు తీసి, విషాద స్వరాల్ని గదిలో నింపుతున్నారు. సంగీతంతో బాటుగా నీడలు మంచు దిమ్మల మీదికి పాకుతూ పోయినట్టుగానూ, ఫిడేలు కమాను వాటిని తన నెమ్మదైన గమనాలతో నడిపిస్తున్నట్టుగానూ అనిపించింది నాకు. భయం అంతటా అలముకుంది. హటాత్తుగా నాకు మా కిటికీలో నుంచి, ఏదో మా యింటికి చేరువగా నడుస్తూ, మంచు దిమ్మల మీద జారుకుంటూ, ఏదో ఒక వింత మానవ విగ్రహం కనిపించింది.

నేను హడిలిపోయి ఒక్క కేక పెట్టి, ఏడవడం మొదలు పెట్టాను. సంగతి కనిపెట్టి మా నాన్నగారు నెమ్మదిగానే అయినా దృఢంగా "నీ ఓవర్ కోటు వేసుకో, గెరా" అన్నారు.

నేను కదలకుండా నిలబడిపోయాను. కాని ఆయన తన కోటును నా భుజాలమీదికి విసిరి, ఆ నీడలోపలికి వెళ్ళారు.

"నేను యిక్కడుంటాను" అన్నదాయన గొంతు.

భయాన్ని వదుల్చుకొని, నేను జాగ్రత్తగా గుమ్మం దాటేను.

అప్పటికే నాన్నగారు పెరడు మధ్యలో నించున్నారు. ఆయన అక్కడ తలెత్తి నిల్చొని, ప్రకృతి నిశ్శబ్దతనూ, శీతకాలపు ఆకాశాన్ని చూసి ఆనందిస్తున్నారు. నన్ను కూడా కనిపెట్టినట్టుగా లేదు.

నేను చుట్టూరా చూశాను. ఎవ్వరూ లేరు. నాన్నగారి దగ్గరికి పది పదిహేనడుగుల దూరం. ఆయన ఏమీ అనలేదు. నేను బెదిరిపోయాను.

"నాన్నా" అని పిల్చాను నెమ్మదిగా.

"ఎందుకక్కడ నిలబడ్డావు? ఇక్కడికిరా" అని ఆయన పిలిచారు.

నేను ఆయన దగ్గరకెళ్ళాను.



ఒక విమానయాన పాఠశాలలో విద్యార్థిగా గెర్మన్ తితోవ్.

"మంచుమీద మన అడుగుల గుర్తులు నీకు కనిపిస్తున్నాయా ?"

"అవును."

"వాడి అడుగుల గుర్తులేవీ, ఆ మనిషివి ?"

మా కాళ్ళకింద మంచు కీచుపెడుతోంటే వణుకుతూ, మా నాన్నగారిని అంటిపెట్టుకున్నాను, మా కాలిజాడలూ, మెత్తగా పరిశుభ్రంగా మెరుస్తోన్న

మంచు దిమ్మల ఊగులాటలూ చూస్తూ. ఇంకో అడుగుజాడలే లేవు.

"ఇక్కడికి ఎవ్వరూ రాలేదురా, గెరా" అని, "నిన్ను భయపెట్టినవి చెట్ల నీడలు" అని చెప్పారు.

నాన్నగారు యింటికి మళ్ళారు.

"పడుకుందాం, పద బాబూ."

ఆయన వెంట పరుగెత్తుదామనుకున్నాను. కాని భయాన్ని అదుపులో పెట్టుకుని, తొందరబాటు తనం కనిపించకుండేందుకు ప్రయత్నం చేశాను. కిటికీల దగ్గరకెళ్ళి మంచు దిమ్మల్ని—నేను అప్పుడే తనిఖీ చేసి చూసిన వాటిని పదేపదే చూశాను. చివరికి, అక్కడికెవ్వరూ రాలేదని నాకు నేను నమ్మకం కలిగించుకున్నాక, నేను యింట్లోకెళ్ళాను. నాన్నగారు, దీనికెంత మాత్రమూ సంబంధంలేని యింకేదో విషయం అమ్మతో మాటాడుతున్నారు, యిదేమీ జరగనట్టుగా.

ఆ తరవాత యిప్పట్లాగ నిర్హేతుకంగా నేను భయపడినట్టు నాకు జ్ఞాపకంలో లేదు. నేను చిన్న కుర్రాడిగా వున్నప్పుడు కూడా, ప్రమాద సమయాల్లోనూ, నేను మొదట బాగా ఆలోచించడానికి ప్రయత్నించే వాడిని; ఆ నల్లని భయమనే "కిటికీ"కి వెలుపల ఏముందో తెలుసుకోవడానికి ప్రయత్నం చేసేవాడిని. అందరిలాగే నేను భయపడేవాణ్ని. కాని అప్పట్నుండీ నన్ను నేను అదుపులో పెట్టుకోవడమూ, ఆ అసహ్య పరిస్థితిని దాటడమూ నేర్చుకోవడమూ మొదలు పెట్టాను.

చిన్నప్పుడు నాకు నాన్నగారు ఆరాధ్య దైవం. ఇప్పటికీ నేను ఎక్కువగా గౌరవించి, ప్రేమించే వ్యక్తే ఆయన. తన ప్రాంతం పట్ల అభిమానం, మా పసి మనసులనూ, సుఖ దుఃఖాలనూ ఆకళింపు చేసుకోవడమూ ఆయనకు ఎలా పట్టుబడిందో నేను తెలుసుకున్నాను. ఆయన అక్కడే పెరిగి పెద్దయ్యారు. ఆయన తోడివారు పొబ్రోవ్కా నదిలోని అదే బండల మీద ఒళ్ళు కాచుకున్నారు.

ఆయన తండ్రి, అంటే మా తాతగారితో బాటుగా గ్రామంలో గుడిసెలు కొన్ని ఆయన నిర్మించారు. మేము అక్షరాభ్యాసం చేసిన చోటనే, ఆయనకూ జరిగింది అక్షరాభ్యాసం. మా నాన్నగారి జీవితం ఎలా వుండేదో,

విప్లవమే గనక రాకపోయి వున్నట్టయితే?

ఆయనొక పేదరైతు కుమారుడు, సోవియట్ రాజ్యంలో ఉపాధ్యాయుడయ్యారు. రష్యన్ భాషా సారస్వతాలను బోధించేవారు. ఆయన సంగీతాభిమాని, ఫిడేలు వాయించేవారు. ఉపాధ్యాయులతోనూ, మా గ్రామం సమీపస్థ రైతులందరితోనూ ఆయన నాటక సమాజాలను స్థాపించారు. నా కోసం ఆయన ఆట వస్తువులు తయారు చేసేవారు, నా చిన్నతనపు సమస్యలు పరిష్కరించుకోవడానికి నాకు తోడు పడేవారు. ప్రజల పట్ల, కుటుంబం పట్ల, స్నేహితుల పట్లా, పని పట్లా గౌరవాన్ని నెమ్మది నెమ్మదిగా, ఓపికగా నాలో కలిగించారు. నాలో వున్న మంచి గుణాలన్నీ మా తండ్రిగారి వల్లే వచ్చేయని, యీనాటికీ నేను అనుకుంటున్నాను.

మా అమ్మ నెమ్మదైన మనిషి, విశ్వాస పాత్రురాలు; ఎప్పుడూ ఏదో పని చేస్తూనే వుంటుండేది. మా చదువు సంగతల్లా పూర్తిగా మా నాన్నగారికే వదిలిపెట్టింది. తుంటరి పనులతోనూ, అవిధేయతతోనూ ఆవిడకు కష్టం కలగించడానికి నేను ఎన్నడూ ప్రయత్నించలేదు.

నేను బాగా చిన్నవాడిగా వున్నప్పుడే, స్నేహానికి ఎంతటి బలం వుంటుందో, తెలుసుకున్నానొకసారి స్వానుభవం వల్ల.

ఒక రోజు ఊరిబయట కుర్రవాళ్ళం దెబ్బలాడుకున్నాం. అదెందుకొచ్చిందో నాకు జ్ఞాపకం లేదు. బహుశా నకుల్ బోన్స్ ఆడుతుంటేనో, లేకపోతే చేపలు పడుతుండగానో యీ పోట్లాట వచ్చి వుంటుంది. ఐదుగురు కుర్రవాళ్ళతో నేనొక్కణ్ణే పోట్లాడుతున్నాను. వాళ్ళు నామీద కుప్పగా పడ్డారు. దుమ్ము మేఘంలా లేచింది. మడమలతోనూ, పిడికిళ్ళతోనూ సాగింది పోట్లాట. ఎవడో నన్ను కింద పడేసి, నా వీపుమీద పడ్డాడు, దొరికిన చోటల్లా బాదుతూ. నా, "విరోధులు" అప్పుడే విజయధ్వానాలు మొదలుపెట్టారు. అప్పుడు హటాత్తుగా చరుస్తున్నట్టుగా, గర్జిస్తున్నట్టుగా చప్పుడు వినిపించింది. నా మీదకెక్కి కూచున్నవాడు తల్లక్రిందులా ఎగిరిపోయాడు.

నేను లేచి నిలబడి చూసేసరికి, ఆ కుర్రవాళ్ళంతా దూరానికి పారిపోయారు. ఇద్దరు దుమ్ములో పోర్లాడుతున్నారు—నా ముఖ్య విరోధీ, యింకో కుర్రాడూ. నేను వెంటనే వెళ్ళి వాడికి సాయపడ్డాను. ఒక్క నిమి

షంలో, పారిపోతున్న "శత్రువు" నందుకున్నాం.

మేము విశ్రాంతి తీసుకున్నాము, ఊపిరి బరువుగా తీస్తూ. మా పొరుగునున్న కోల్కా నా పక్కను కనిపించాడు, ముక్కంట రక్తం కారుతోంది. వాడు నాకన్నా కాస్త పెద్ద. ఈ తగాదాతో వాడికేమీ సంబంధం లేదు. వాడు హటాత్తుగా దెబ్బలాటలోకి ప్రవేశించాడు.

"వాళ్ళు నిన్నెందుకు కొడుతున్నారు? మీ నాన్నతో చెపతావా" అని కోల్కా అడిగాడు.

"చెప్పను. నువ్వెందుకు తగవులోకి వచ్చావు?" అని నేను వాణ్నడిగేను, వాడు ముక్కుకున్న రక్తం తుడుచుకుంటూంటే.

"నీకు సాయం చేయడానికి. ఐదుగురు ఒక్కణ్ని కొడుతున్నారు, చూడూ. ఏటి దగ్గరికెళ్ళి ముక్కులు కడుక్కుందాం, పద."

అప్పట్నుండీ మేము నేస్తాలమయ్యేం. వాడు నా పక్కనున్నప్పుడు నాకెంతో బలమనిపించేది. అన్ని రకాల యుద్ధాల్లో మేము ఒకరికొకళ్ళం చేదోడుగా వుండేవాళ్ళం.

ఏడేళ్ళనుండి పదేళ్ళ వయసులోగా, యింకొకళ్ళ ఆపిల్ పళ్ళతోటలోకో, లేకపోతే అప్పుడప్పుడే మొలకలెత్తుతోన్న కేరట్ దుంపల తోటలోకో చొరబడనివాణ్ని సరైన మనిషిగా నేను లెక్క గట్టను. మేము కూడా సాయంకాలాలు దోసకాయల పెరళ్ళలోకి "దాడులు" చేసేవాళ్ళం. ఇవంటే నాకు యీనాటికీ మహా యిష్టం. మా ఆల్తాయ్ దోసకాయల పెరళ్ళలో మేము రాత్రి వేళల్లో తస్కరించిన కాయలు, రుచిలో సర్వోత్కృష్టమైన వనుకుంటాను.

నేను బడికి వెళ్ళడం మొదలు పెట్టిన ప్రాయంకంటె, నా పసితనం యింకా ఆనందంగా వుండేదనిపిస్తుంది. నేల, అడవి, పొలాలూ ఒకటే ఆరోజుల్లో. రాత్రుళ్ళ తరవాత ఉదయాలూ, శీతకాలాల తరవాత వసంత కాలాలూ. కాని యుద్ధం వచ్చింది. మా గ్రామస్తుల ముఖాలమీదా, ఆలోచనలమీదా గాంభీర్యపు ముద్రను కొట్టించది. మా గ్రామంకంటే పెద్దదీ, మా దేశం ఏ జీవితంకోసం పోరాడుతూ వుందో ఆ జీవితంలాగా చాలా ముఖ్యమయిందీ ఏదో వుందని తెలిసింది నాకు.

మా వీధికి సరిగ్గా మధ్యను చిన్న దిబ్బొకటుండి. దానిమీద ఎత్తయిన గడ్డి ఎప్పుడూ పెరిగి వుండేది. ఇప్పుడక్కడది లేదనుకొండి. అది చదును చేశారు. కాని దానికి సంబంధించిన జ్ఞాపకాలు నాకు చాలా ప్రాముఖ్యం గలవి.

1942వ సంవత్సరం వచ్చింది. మా నాన్నగారు యుద్ధ రంగానికి వెళ్ళారు. ఇల్లు వదిలి వెళ్ళడానికి ఆయనకు చాలా కష్టమనిపించింది. ఆ రోజు అమ్మ తెల్లారక ముందరే లేచి, యింటి పనుల్లో పడిపోయింది.

నాన్నగారు నిదానంగా అన్ని పనులూ చేసుకొని సిద్ధమయ్యారు.

"సరే, అయితే యిక..."

"తొందర వద్దు. యుద్ధాని కెళ్ళడానికంత తొందరదేనికి ?" అన్నారు వీడ్కోలివ్వడానికి వచ్చిన తాతయ్యగారు.

అనంతంగా జాప్యం చెయ్యడం వీలుపడదు. కొంతసేపటికి, ఆ "వేళ" అయ్యింది.

నాన్నగారు సంచి చేతబుచ్చుకున్నారు. తోవలో తినడానికి దాన్నిండా తినుబండారాలున్నాయి. ఆ సంచీని భుజానికి తగిలించుకున్నారు. ఆయన తలుపు దగ్గర కెళ్ళారు. నాకు గుండె ఆగిపోయింది. ఆయన యిలాగనే వెళ్ళిపోతారా ?

"వెళ్ళడానికి ముందర కాస్సేపు కూచుందాం" అంది అమ్మ, కంట తడిపెట్టుకుంటూ.

అందరం నిశ్శబ్దంగా కూచున్నాం, రష్యన్ సాంప్రదాయం ప్రకారం. ఒక క్షణం గడిచింది, యింకో క్షణం. నాన్నగారు చటాలున నుంచున్నారు.

"గెరా" అని పిలిచారు.

నేను ఆయన దగ్గరకెళ్ళాను.

"సంగతేమిటంటే" అన్నారు నెమ్మదిగా, దేన్ని గురించో తాను ప్రతిరోజూ ఆలోచిస్తున్నట్టుగా, "నేను యుద్ధానికెళ్తున్నాను, నాయనా."

నేను మా నాన్నగారి వేపు చూశాను. ఆయన శుభ్రంగా క్షవరం చేసుకుని, దృఢంగా, నీటుగా వున్నారు. రవ్వంత విచారంగా నా వేపు చూశారు. గడ్డమీద కాస్తంత గీసుకుని వుంది. "క్షవరం చేసుకుంటున్న

ప్పుడు తెగింది" అనుకున్నాను నేను.

"మీ అమ్మ చెప్పినట్టు విను. సాయం చెయ్యి. ఇంట్లో మొగాడివి నువ్వే. తెలిసిందా ?"

నేను తలూపేను. నాకు తెలిసింది. నాకప్పుడు అర్థమయ్యిందల్లా —నాన్న వెళ్ళిపోతున్నారనే. ఎంతో కాలం పెద్ద ప్రమాదాన్ని ఎదుర్కోవడానికి,

ఆయన తన అరిచేతిని ముద్దుగా నా తలమీద పెట్టి, ముంగురులు నిమిరారు. తరవాతను నాన్నగారు, నన్ను బెదరగొట్టిన నీడను ఎదుర్కోవడానికి ఆ శీతకాలంలో వెళ్ళినంత ప్రశాంతంగా గుమ్మం దాటి, బయటికి వెళ్ళారు. నేనాయన వెంట పరిగెత్తాను.

"నాయనా, యింటిదగ్గరుండిపో" అంది అమ్మ.

"ఇంట్లో మొగాడివి నువ్వే." నేనుండి పోయాను. నాన్నగారు దూర దూరంగా వెళ్ళిపోవడం చూస్తున్నాను, దడి తలుపు మూసి, కంటికి కానరాకుండా వెళ్ళిపోయినంతదాకా.

ఒంటరిగా యింట్లో వుండడం అసాధ్యం. నేను వీధిలోకి పరుగెత్తుకెళ్ళి, ఆ దిబ్బమీద ఒత్తుగా పెరిగివున్న గడ్డిలో వెల్లకిలా పడున్నాను రాత్రయ్యేదాకా అక్కడే పడున్నాను, కళ్ళు నెప్పి పుట్టేదాకా మినుకుమినుకుమనే చుక్కల్ని చూస్తూ. ఆ వేళ పొద్దుపోయేదాకా ఆ కుర్రవాడు, చాలా సేపు ఆలోచించాడు తీవ్రంగా, పెద్దవాళ్ళు ఆలోచించినట్టుగా.

యుద్ధం దుఃఖాన్ని తెచ్చిపెట్టింది, గ్రామంలో స్త్రీలు విధవలయ్యారు. నా స్నేహితుడు యూరా అనాథుడయిపోయాడు. కొందరికి తండ్రులు పోయారు, అన్నదమ్ములు పోయారు. యుద్ధం వల్ల మా గ్రామానికి బాల మందిరం వచ్చింది, ముట్టడిలో వున్న లెనిన్‌గ్రాడ్ పిల్లలకోసం. వృద్ధులకూ, స్త్రీలకూ, మాలాంటి పిల్లలకూ పురుషులు చేసే బరువైన పనులు తెచ్చి పెట్టింది యుద్ధం. పోల్కొవ్నికోవో గ్రామం నుంచి మేము మైస్కోయి ఉత్రోకు వెళ్ళాము మా తాతగారితోనూ, మా అమ్మతోనూ. మా అమ్మ పక్కను నేను పొలంలో పని చేశాను, ఆమెకు యింటి పనుల్లో సాయంచేశాను, గడ్డికుప్పలు వేశాను, తోటలో కలుపు తీశాను. పరిస్థితులు

సులువుగా లేవు. చేతులూ, కాళ్ళూ నొప్పులెత్తుతోంటే, నడుం బాధ పెడుతూంటే పెద్దవాళ్ళలాగా పాటుపడడం అంటే ఏమిటో నాకు తెలిసి రావడం మొదలయ్యింది.

యుద్ధమంటే వేళాకోళమేమీ కాదు. తూట్లు పడిపోయిన జోళ్ళకు బదులుగా కొత్త జోళ్ళు కొనుక్కోవడం కష్టం. సిగరెట్లు లేవు, పొగాకు లేదు. మిహైలో తాతయ్యకు పొగతాగడానికి యిబ్బంది వచ్చింది. అంచేత యింట్లో నాటు పొగాకు కత్తెర పెలిసింది, యింట్లో పండిన పొగాకును కత్తిరించడం నాపనయ్యింది. కాగితం కొనడం అసాధ్యం. ఒకనాటి సాయంత్రం, నాన్నగారి ఒక పుస్తకం అట్ట నా కంటబడింది. పుటలన్నీ జాగ్రత్తగా చించబడ్డాయి, అట్ట కిటికీమీద పడివుంది, యింట్లో పండిన పొగాకు పెట్టె పక్కను.

నాన్నగారి పుస్తకాలు అటకమీద దాచాము. ఈ పుస్తకాన్ని ఎవరు దొంగతనం చేశారు?—అని నేను కోపంగా ఆశ్చర్యపడ్డాను. రాస్ప్ బెర్రీ పండు రంగుమీద బూడిద రంగు అక్షరాలతో అట్టమీద రొజెన్బె బుర్రై అని వుంది. ఇటీవలే తాతగారా పుస్తకాన్ని చదువుతున్నారు, దీపానికి దగ్గరగా కూచొని, మరి యిప్పుడో...

కొద్ది రోజులయ్యేక అంతా స్పష్టమైపోయింది. తాతగారు ఒక పుస్తకం తరవాత యింకో పుస్తకం తీసేవారు. దాన్ని యీ మూలనుండి ఆ మూలకు జాగ్రత్తగా చదివేవారు. తాను చదివినంతవరకూ ఒక పేజీ తరవాత యింకో పేజీ చించేవారు, సిగరెట్లకు చుట్టడానికి. ఇందుకు సిగ్గుపడుతున్నట్టుగా ఆయన, యింట్లో ఎవ్వరూ లేనప్పుడే పేజీలు చించేవారు. జాగ్రత్తగా దొంతర పెట్టిన పుస్తకాల అట్టల కుప్ప కిటికీలో పెరిగిపోతోంది.

ఒకనాడు సాయంత్రం అటకమీదనుండి దిగారు, తన కొత్త దోపిడీ వస్తువుతో. ఈసారి ఆయన చంకలో లావాటి సంపుటం ఏదోవుంది. ఇది చాలాకాలం వస్తుందనుకున్నాను. కాని నేను పొరపడ్డాను. అట్టలు కిటికీలో కుప్పలు పడుతూనే వున్నాయి. తాతయ్య ఆ లావాటి పుస్తకం చదువుతూనే వున్నారు, ఒక్క పేజీ దాన్లోంచి చింపకుండా. నేనేదో పని చేస్తూ ఆ పుస్త

కొన్ని ఒత్తుగా ఉపయోగించడానికి ప్రయత్నించాను.

"అదక్కడ పెట్టెయ్యి" అన్నారు తాతయ్య గట్టిగా. "ఆ పుస్తకం చెడగొట్టకు, కుర్రాడా. అది కథల పుస్తకమేమీ కాదు. అది కారల్ మార్క్స్ పుస్తకం. మనిషి మనసుకూ, అనుభవానికీ సంబంధించిన కా-పి-టల్."

పూర్వపు గెరిల్లా యోధుడూ, నమోదు చేయబడని పూర్వపు పేద రైతూ అయిన తాతయ్య యించుమించు డెబ్భై ఏళ్ళ ప్రాయాన, మార్క్స్ పుస్తకాలలోని మనిషి మనసుకూ, అనుభవానికీ సంబంధించిన నిధులగురించి తెలుసుకున్నారు.

గ్రామంలోని మిగిలిన గుర్రాలూ సైనిక దళాల వాగన్లలోనికి తీసుకపోబడిన తరవాత, సమిష్టి క్షేత్రపు పశువులను బళ్ళు లాగడానికి, తాతయ్య తర్ఫీదు చేయడం మొదలుపెట్టారు. ఆయన యీ పని గొప్ప నేర్పుతో చేశారు. ఈ రాకపోకలకు ఆయన తరచు నన్ను తీసుకెళ్ళేవారు. మేమెప్పుడూ ఏదో తీసుకవెళ్ళేవాళ్ళం, ప్రతిసారీ ఏదో ఒక బరువును తీసుక రావడానికి ప్రయత్నించేవాళ్ళం. ఆ బరువుమీద నన్ను కూచోబెట్టి, ఆయన కళ్ళెం పుచ్చుకొని ముందు నడిచేవారు. ఏ కారణం వల్లనో తేలీదు గాని ప్రతిసారీ ఆయన "నేను కొండమీది కెళ్ళాను" అన్న పాటను పాడుతూనో, లేకపోతే పరాచికాలాడుతూనో ఆవును తోలేవారు.

ఏదేనా ఎత్తుమీదికొచ్చాక తాత గారు, ఆవుకు కాస్త విశ్రాంతి నిచ్చేవారు.

"కిందికి రా" అని పిలిచేవారు. తరచు ఆ రోడ్డు మీదనే ఆయన ఏదేనా లెక్కల పాఠం మొదలు పెట్టేవారు.

"చెప్పు, నాయనా" అంటూ మొదలు పెట్టేవారు కొంటెగా చూస్తూ, "ఒక షావుకారు దగ్గర యిరవై ఐదు కోపెక్కులున్నాయి. అతను ఎనిమిది కాన్వాస్ కోసమూ, ఏడు రిబ్బన్ కోసమూ ఖర్చు చేశాడు నాలుగు ఒక స్నేహితుడికి అప్పిచ్చాడు. తన దగ్గర డబ్బు కాస్తంతమాత్రమే వుందని కనిపెట్టి, ఒక స్నేహితుడి దగ్గర్నుంచి పదకొండు కోపెక్కులు తీసుకున్నాడు..."

లోపలే తాతయ్య యిచ్చిన చిన్న లెక్కను చేసేసి, నేను జవాబు

చెప్పేవాణ్ని. ఆయన సంతోషించేవారు. తరవాత "ఇక, పోదాం పద"అని ఆజ్ఞాపించేవారు.

అప్పుడప్పుడు తాతయ్య పాత జ్ఞాపకాలు తెచ్చుకునే వారు. "గెరా, చూడక్కడ. జురవ్‌లిఖీనుండి బసను మా గ్రామానికి మార్చుకున్నాం. మా తోటలో మా పరిశీలనా స్థావరముండేది. ఆ రోజుల్లో మేము తుపాకి లేకుండా, గుర్రం మీదైనా సరే, బరువుమూట అటుంచి, ఆవుతోనైనా సరే ప్రయాణం చేసేవాళ్ళం కాదు."

తరవాత నేను కమ్యూన్ చరిత్రనూ, నా కమ్యూనార్డ్ తాతయ్యల కథను తెలుసుకునేవాణ్ని. కమ్యూనార్డ్‌లకు ప్రథమ విద్యాదాత, స్నేహితుడూ అయిన ఆంద్రియన్ మిత్రోఫనోవిచ్ తొపొరోవ్ పేరు విని, దాన్ని సర్వదా జ్ఞాపకం పెట్టుకున్నాను.

విప్లవజ్వాల మా ప్రాంతాలకు వ్యాపించింది: కమ్యూన్లు స్థాపింపబడ్డాయి, సెలవలకు రెడ్‌గార్డు సైనికులు వచ్చినచోట్ల, సైబీరియన్ గెరిల్లాలు గ్రామాలను, మొత్తం జిల్లాలకు జిల్లాలనే వైట్ ఆర్మీ దళాల నుండి గెలుచుకున్నచోట్ల. ఆ కమ్యూన్ నిర్మాతలలో మా తాతలు యిద్దరూ వున్నందుకు నేను గర్విస్తున్నాను.

భూస్వాములకు ఆటపట్టయిన పాతగ్రామాల్లో కమ్యూనార్డులు వుండ దలచుకో లేదు. వారు దూరంగా మంచి తావును ఎంచి, కొత్త గుడిసెలను నిర్మించడం మొదలుపెట్టారు. పాత తావులనుండి పాత గ్రామాలను కదల్చడం మొదలుపెట్టారు. వారు గాదులూ గిడ్డంగులూ కట్టారు, బీళ్ళను సాగుక్రింద పెట్టారు. కొత్త గ్రామానికి మయ్‌స్కాయి ఉత్రో (మే నెల ఉదయం) అని పేరు పెట్టాలని ఒక కమ్యూనార్డు ప్రతిపాదించాడు.

ఆకలిగొన్న తోడేళ్ళ గుంపుల్లాగా తైగాలో తిరుగులాడిన భూస్వాముల మూకల్నుండీ, వైట్‌గార్డ్ దళాలనుండీ కమ్యూనార్డులు తమ ఆస్తిపాస్తుల్ని కాపాడుకోవలసి వచ్చింది. కమ్యూన్ వ్యవహారాలన్నీ సమిష్టిగా నిర్ణయం చేయబడేవి. ప్రతి ఒక్కటీ సమానంగా పంపకం చేయబడేది. అంతా కలిసి, పెద్దా పిన్నా అంతా ఒళ్ళు దాచుకోకుండా ఒకే జట్టుగా పని చేసేవారు.

అంద్రియన్ మిత్రొఫనోవిచ్ తొపొరోవ్, ఆ గ్రామంమీదుగా వెళ్ళిన ఒక రెడ్ ఆర్మీ దళంతో వచ్చారు. తొపొరోవ్‌ను ఎరిగిన గ్రామస్తులందర్లాగే మా తాతగారు, కన్నతండ్రి గురించి కూడా ఎవరూ చెప్పనంత గౌరవంతో ఆయనగురించి మాకు చెప్పారు. ఆయన కమ్యూనార్డులకు రాత, చదువు నేర్పారు. వాళ్ళ పిల్లలకు పుస్తకాలన్నా, విజ్ఞానం అన్నా అభిమానం కలిగించారు.

కమ్యూనార్డులొక పాఠశాల కట్టారు. దాన్లో పిల్లా, పెద్దా అంతా చదువుకున్నారు. తొలి రోజుల్లోనయితే పుస్తకాలు అంతా కలిసి చదవడం జరిగేది. తొపొరోవ్ మా నాన్నగారికి కూడా అయ్యవారు. చిత్ర లేఖనం, సంగీతం అంటే అభిమానాన్నీ, ఉపాధ్యాయుడు కావాలన్న కోరికనూ మా నాన్నగారికి కలిగించిందాయనే.

కమ్యూనార్డుల సర్వసమావేశంలో కొత్త రైతులు కమ్యూన్లలోకి చేర్చుకోబడేవారు. అప్పుడు వారు కమ్యూన్లకు విధేయులుగా వుంటామనీ, నవజీవితాన్ని నిర్మిస్తామనీ, పోట్లాడుకోకుండా శ్రద్ధగా పనిచేస్తామనీ, పాత అలవాట్లు వదులుకొని కమ్యూన్ సాంస్కృతిక జీవితంలో పాల్గొంటామనీ ప్రమాణాలు చేసేవారు. కమ్యూనార్డులా ప్రమాణాన్ని పాటించారు.

మా గ్రామపు పాతరోజుల గురించి యిప్పుడు నేను ఆలోచిస్తోంటే, కమ్యూనార్డులకు గురువూ, మా నాన్నగారికి ఉత్తేజాన్నిచ్చిన వ్యక్తీ అయిన తొపొరోవ్‌ను తల్చుకుంటూవుంటే; ఆయన స్థాపించిన పాఠశాలలో నేను చదువుకున్నందుకూ, తొలి జ్ఞానభిక్ష ఆయన పెట్టినందుకూ, నేనుకూడా ఆయనకు రుణపడి వున్నాననిపిస్తుంది నాకు.

యుద్ధరంగలోవున్న మా నాన్నగారి దగ్గర్నుండి ఉత్తరాలు చాలా అరుదుగా వచ్చేవి. వాటిలో మేమెలా గడుపుతున్నామన్న ఆందోళన ఎక్కువగా వుండేది. కుటుంబానికీ, తన ప్రాంతానికీ దూరమైపోయి నాన్నగారు విచారంగా వున్నారు. ఒకసారి, సైన్యంద్వారా ఆయన వాసురాసిన పద్యాలు మాకు పంపించారు :

ఎంత ఆనందంతో
మా నేలకు నాగుండెను హత్తుకుంటాను,

ఎంత ఉద్రేకంతో
మా పొలంలో నడుస్తాను.

ప్రభాత ప్రశాంతతలో
తొలి వెలుగులు సన్నసన్నగా జారివస్తోంటే,
ఎక్కడో దూరాన పొలాల్లో
పుంజు తన ప్రేయసిని పిలుస్తోంది.

బాల గృహంలోని లెనిన్‌గ్రాడ్ పిల్లలు నాకు స్నేహితులయి పోయారు. నిజం చెప్పాలంటే, వాళ్ళంతో బెట్టుసరిగా వుండడమూ, మాకంటే ముందుగా దుఃఖాన్ని రుచిచూసిన ఆ పిల్లలు, గంభీరంగా, పరిపక్వంగా వుండడమూ నాకు ఆశ్చర్యం వేసింది.

ఇక్కడన్నే నాకు బాల్యపు తొలివలపు అంకురించింది. లోరా వినోగ్రదోవా. ఏం చెప్పేదీ? లెనిన్‌గ్రాడ్ పిల్లలందర్లోకీ అందగత్తె కాదా పిల్ల. కాని నాకింకా జ్ఞాపకం వుంది, ఆ పిల్ల వికారపు నల్లకోటూ, గంభీరమయిన ముఖమూ, తెల్లటి హేటూ. మొదట ఆ పిల్లని దూరంనుంచి చాలాసేపు చూశాను. మాటాడ్డానికి భయమేసింది, అసహ్యంగా వుంటుందేమో నన్న భయం.

ఏదోవిధంగా, వాటంతటవే అన్ని సంగతులూ తెలిశాయి. ఆ పిల్ల తన తలిదండ్రులగురించీ, ఆకలి బాధలగురించీ, నాశనమైన లెనిన్‌గ్రాడ్ గురించీ, మాదగ్గరకు ఆల్తాయ్‌కి చలిలో వచ్చినప్పటి కష్టాలగురించీ నాకు చెప్పింది. ఎవ్వరూచెయ్యని ఏదో ఘనకార్యం చెయ్యాలనీ, అందుమూలంగా ఆ పిల్లా, ఆ పిల్ల చిన్న తమ్ముడూ వాళ్ళింటికి వాళ్ళు వెళ్ళిపోయి, యింకా జీవించివున్న వాళ్ళ తలిదండ్రుల్ని వాళ్ళు కలుసుకునేటట్టుగా చేయాలనీ నేను గట్టిగా అనుకున్నాను. ఆ బాలగృహపు కఠిన నియమాలంటే నాకు పూర్తిగా ద్వేషం అయినందువల్ల, మరీ అనిపించిందిలాగ నాకు. లోరా ప్రతిరోజులాగే ఒకే సమయంలో నిద్రపోవాలి, ఒకే సమయంలో పొద్దుట, మధ్యాహ్నం, రాత్రీ తినాలి. గ్రామంలోని పిల్లలం తినడం, బయటికి వెళ్ళడం మాకు ఇష్టం వచ్చినప్పుడు చేస్తాం. చీకటిపడ్డాక మాత్రమే మమ్మల్ని యింటికి పిలుస్తారు.

యుద్ధం అయిపోయింది. నాన్నగారు ఇంటికి తిరిగివచ్చారు. మేము వోల్కోవ్నికోవోకు తిరిగీ వెళ్ళాం. నాన్నగారు తన పనిలో చేరారు. నేను కొత్త పాఠశాలలో ప్రవేశించాను.

కొత్తగా చేరిన కుర్రవాడికి ఒక మాదిరీ పరిక్షలతో ఆహ్వానించడం కుర్రవాళ్ళలో ఒక సాంప్రదాయ మనుకుంటాను. అవి రకరకాలైనవి. నాకు గట్టి పరిక్షే వచ్చింది.

నేను తరగతిలో చేరిన రెండు మూడు రోజుల్లో, యితరుల పురమాయింపువల్ల ఒక కుర్రాడు నాతో కయ్యానికి కాలుదువ్వుతున్నాడనిపించింది నాకు. వసారాలో నన్ను తొయ్యడం, నా జాగాలో కూచోవడం, నన్ను ఎగరగొట్టడం వంటి తుంటరి పనులు సాగుతున్నాయి. ఓపిక తరగనంత వరకూ ఓర్చుకున్నాను. కాని ఒకసారి తరగతులు మారుతోంటే, యింకో తాపు తిన్నాక, నేను ఎగిరిపడి, వాడి చెవ్వుమీద ఒక్కటిపేశాను. క్లాసంతా గమ్మున ఊరుకుంది, యిది జరుగుతుందని ఊహించి వుండడం వల్ల.

అదృష్టవశాత్తూ, యీ తుంటరికంటే నేను బలహీనుణ్ని కాను. క్లాసు గది నేలమీద మేము దొర్లాము, నిశ్శబ్దంగా, మనసారా ఒకరినొకరు బాదుకొంటూ. నేను గట్టిగా వాణ్ని తోసేస్తున్నాను. వాడు తన జేబులోంచి ఏదో బయటికి తీశాడు, బహుశా నన్ను బెదిరించడానికి. కాని నేను వాణ్ని వదిలిపెట్టలేదు. హటాత్తుగా నా ముఖంమీద ఎడం వేపున చాలా నొప్పి కలిగింది. రక్తం కారిపోతోంది. నేను యుద్ధం సాగించడానికి సిద్ధంగానే వున్నాను. కాని రక్తం కారుతోన్న నా ముఖం నా విరోధిని భయపెట్టింది. పోట్లాట సమాప్తం కాకుండానే, వాడు కాళ్ళకు బుద్ధిచెప్పాడు.

"నిలబడు !"

కాని పిట్ట ఎగిరి పోయింది. రక్తంచూసి పిల్లలు బెదిరిపోయి గొల్లుమన్నారు. రక్తం కడుక్కోవడానికి నేను పరుగెత్తాను. వసారాలోకి ప్రిన్సిపాల్‌గారు వచ్చారు.

"తితోవ్! నీకిది ఎవరు చేశారు ?"

నేను మాటాడలేదు. అప్పుడు భయంతో తడబడుతూ ఒక అమ్మాయి, నా విరోధి పేరు చెప్పింది.

నేను పగలు జ్ఞాపకం పెట్టుకోను, నేను తొందరగానే కలిసిపోతాను. మూడు నాలుగు రోజులు తరవాత, వాడూ నేనూ కలిసి లప్తా ఆడుకున్నాం. ఇప్పుడు సరిగ్గా కనిపించకుండా వున్న ఆ మచ్చ, జీవితంలో నా మొదటి "రక్తసిక్త"మైన పోరాటంలో నేను వెనుకడుగు వెయ్యకుండా నిలబడ్డానన డానికి రుజువు. ఆ తరువాత, యిక నన్నెవ్వరూ ఇబ్బంది పెట్టలేదు. నకుర్ బోన్స్ ఆటలోనూ, "కొట్టి పారిపో" అన్న ఆటలోనూ—మా సైబీరియాలో లప్తా ఆట నిలా అంటారు—నన్ను పూర్తి భాగస్తునిగా అంగీకరించారు. నిబంధనలతో అమెరికాలో యీ ఆట బేస్‌బాల్ అన్న అంతా ఆడే ఆటయ్యిం దని విన్నాను. ఈ ఆటను మూలం ఒకటే.

లప్తా, బహుశా నా అభిమాన క్రీడ. ఎంచేతనంటే నేను బాగా పరి గెడతాను. నాకు పన్నెండో, పద్ధాలుగో ఏళ్లు వున్నప్పుడు, మామూలు జోళ్ళతో నూరు మీటర్లు పన్నెండు సెకండ్లలో పరుగెత్తేవాణ్ని. అంచేతే అనుకుంటాను, మా కుర్రవాళ్ళ పుట్‌బాల్ జట్టులో నేను మూడేళ్లు ఫార్వర్డ్‌గా ఆడేను. టెక్నిక్‌లో నేను పెద్ద ప్రవీణుణ్ని కానుగాని, నన్నందుకోవడం కష్టమే.

ఐదో తరగతిలోనే మా పిల్లల్లో చాలమందికి "క్లబ్బు జబ్బు" పట్టు కొంది.

మాకు గెయా కోస్త్రోవా అన్న ఉపాధ్యాయిని వుండేవారు. ఆవిడ పెద్ద బాల సంఘ నాయకురాలు కూడానూ. పాఠశాలలో ఒకసారి ఆవిడ నన్ను పిల్చి, బృందగానంలో నన్ను చేరమన్నారు. నన్నేదేనా పాడమని అడిగారు. చెప్పనలవిగాని ప్రయత్నం చేసి, నల్ల సముద్రపు నావిక వీరుని గురించి అందరూ పాడేపాటను బిగ్గరగా పాడేను. "భయంకరమయిన నల్ల సముద్రంలో చల్లని కెరటాలు మంచుగడ్డను పైకెత్తాయి...."

నా పాట కోస్త్రోవాకు నచ్చిందో లేదో నాకు తెలియదు. అయితే నా గొంతుక నాకు నచ్చింది. కాని కొద్ది నిమిషాలయ్యేక గెయా కోస్త్రోవా పాడినప్పుడు, నేను చలియపిన్ అంతటి గొప్ప గాయకుణ్ని కాబోవడం లేదని గ్రహించాను. ఆమె గొంతు బలంగా వున్నంత ఎక్కువ అందంగా లేదని యిప్పుడు నాకు జ్ఞాపకం. ఆమె పైస్థాయిలో పాడినప్పుడు కిటికీ

తలుపులు కదిలాయి. కాని ఆ సమయంలో నేను కదిలిపోయి కంగారు పడ్డాను. నేను గాయకుల బృందాన్ని వదిలిపెట్టి, సాహిత్య బృందానికెళ్లాను.

సాహిత్య బృందంలో నాకు రానురానూ ఆసక్తి యెక్కువయ్యింది. త్వర్దొవ్‌స్కీ కథ జార్, పూజారి, మిల్లు పనివాడూ ను ఒకరోజు నేను చదవడం నాకు జ్ఞాపకం వుంది. నేను వేదికమీద దాన్ని చదివితే, పిల్లలు పొట్ట చెక్కలయ్యేటట్టుగా నవ్వుతారని అప్పుడు నాకనిపించింది. ఈ కథ యిలా మొదలవుతుంది :

రైధాన్యం కప్పిన పొలాల్లో
గుర్రంమీదనో, కాలినడకనో వెళ్తే
కనిపిస్తాయి కుడివేపున దేవుడి గుడీ
ఎడమను గాలి మిల్లూ.

వాటికావల దట్టమైన ఫిర్ తోపు
లేచివుందది ఆకాశం వేపు
ఎడమవేపు నున్నాడు మిల్లు పనివాడు
కుడివేపున సరేసరి పూజారి.

రష్యన్ కథలన్నిట్లోలాగే ఆ మామూలు పనివాడు, అపరాన్నభుక్కు కంటె తెలివైనవాడు, వివేకవంతుడు.

ఈ కథ యిలా ముగుస్తుది :

కథ ముగిసిందిలా.
జారు శిక్ష విధిస్తూ
పూజారిని మిల్లు పనివాణ్ని చేశాడని—
అని చాలకాలం అనుకున్నారు
ఒకరి చెవిలో ఒకరు.

గ్రామస్తులు పూజారిని చేశారు
మిల్లు పనివాడిగా, రైతుగా
ఇది జరిగిందో, లేదో
ఎవరూ చెప్పలేదింతవరకూ.

నేను వెంటనే యీ కథను భట్టీ పెట్టాను. అయితే పాఠశాల వేదిక

మీదనుండి దీన్ని చదివే అవకాశం నాకు వచ్చినప్పుడు, పిల్లలు పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వలేదు. ఇందుకు నేను విచారపడ్డాను. కాని వాళ్ళు మంచి స్నేహితుల్లాగా హర్షధ్వానాలు చేశారు. ఆ విధంగా క్లబ్బు కార్య కలాపాల్లో నాకు బాగా యిష్టం కలగడం మొదలయ్యింది.

సాహిత్య బృందాలూ, గ్రామ కార్యకలాపాలూ మాకు అనుకోకుండా వచ్చినవి కావు. మా పాఠశాల ఉపాధ్యాయులు సాహిత్య బృందాన్ని పెట్టడమే కాదు, దాన్ని నడిపేరు కూడా. వాళ్ళే గ్రామంలో సంస్కృతి కోసం ప్రచారంచేస్తూ, కళా వ్యాసంగాల్లో పాల్గొంటూ, పిల్లల్నీ పెద్దల్నీ కూడా వాట్లో చేర్చారు.

నాటకాలూ, నాటికలూ గ్రామంలో ప్రదర్శింపబడ్డాయి. స్థానిక విష యాలు రకరకాల నాటక వస్తువులయ్యాయి. వాటిలో చాలా భాగాన్ని ఉపా ధ్యాయులే రాశారు. మా జిల్లా ఔత్సాహిక కవి కులిక్ చాలా నాటకాలూ, పద్యాలూ వ్రాశారు. ఆయన రాసిన పాటకు మా నాన్నగారు స్వరం కట్టారు. దీన్ని ఆల్తాయ్‌లో వున్నవాళ్ళం "ఆల్తాయ్ గీతం" అని అంటాం.

కాలం అంతా నేను సాహిత్య బృందానికే వినియోగించలేదు. నేను ఆటలాడేవాణ్ని, సినీమాలకు వెళ్ళేవాణ్ని, చదివేవాణ్ని, "అడవి" కుర్ర వాళ్ళ సాహస చర్యలను అసలే పోనిచ్చేవాణ్ని కాదు. మాలో ప్రతి ఒక్క డికీ ఆటలంటే యిష్టం. అయితే మేము పోటీల్లో పాల్గొనేవాళ్ళం కాదు, ఫుట్‌బాల్ పోటీలు తప్పితే. నాకు స్కేటింగ్ ఎంతో యిష్టం, అదొక రోజు మహా ప్రమాదంగా పరిణమించింది.

నడి శీతకాలంలో, చెరువుమీద మంచు కప్పి వుండగా, మేము దాని మీదికి స్కీల పైని వెళ్ళాం. శీతాకాలం మొదట్లో చెరువులమీద కనిపించే తొలి పల్చని మంచును స్కేట్లుకోసం పెట్టుకున్నాం.

ఒకసారి నా ప్రతాపం చూపెడదామనుకున్నాను. పల్చని మంచుతో అప్పుడే కప్పివున్న నీటికడ్డంగా అనేకసార్లు వెళ్ళాను. మంచు పగులు తోంది, కుంగుతోంది. నాకు బ్రహ్మానందమవుతోంది. ఇంకోసారి చుట్ట డానికి నేను తిరిగాను, బయలుదేరాను, కాగితంలాగ పల్చగా వున్న మంచు కరకరలాడింది. వెంటనే నేను మెడలోతు నీటిలోకి దిగిపోయాను. అదృష్ట

వశాత్తూ చేతులు బార చాచగలిగాను. అయితే నీటితో బరువెత్తిన నా బట్టలు ప్రతిక్షణమూ దిగలాగుక పోతున్నాయనిపించింది నాకు.

అటువంటి పరిస్థితిలో వున్నప్పుడు, మనిషి ముందర ఒక లిప్తలో అతని జీవితం అంతా కనిపిస్తుందంటారు. నాకు చావు రాసి లేదు, అంచేత నా ఎదట నా జీవితమంతా కనిపించలేదు. నాకు చుట్టూరా ప్రపంచమంతా ఘనీభవించిపోతున్నట్టుగా అనిపించడం నాకు జ్ఞాపకమే. కుర్రవాళ్ళ ముఖాలు గడ్డకట్టుకపోయాయి, బిర్చితోపు గడ్డకట్టుకపోయింది, గాలిలో కాకులు గడ్డకట్టుక పోయాయి, చలి మసక వెలుతురులో విస్తరించిన సూర్యుని నారింజ బింబం సైతం గడ్డకట్టుకపోయింది.

అంతటా నిశ్శబ్దం. నాకు చుట్టూరా పగులుతోన్న మంచు మాత్రం మెల్లగా విచారపు చప్పుళ్ళు చేస్తోంది. ఈ పరిస్థితిలో నా తల సీసంలాగా బరువెక్కింది. హటాత్తుగా అప్పుడు, నాకు బాగా చేరువలో ఒగుర్చు తోన్న ఊపిరితో, ఏడుపు గొంతుకతో "గెరా! నీ చెయ్యి, నీ చెయ్యి!" అంటూ గుసగుసలాడింది.

ఆ మాట వినిపించిన వేపు నేను చేయి చాచేను, ఊత దొరికింది. చల్లగా వున్న చిన్న చేయి ఏదో నన్ను పట్టుకుంది. చూస్తును గదా గల్కా అన్న చిన్న అమ్మాయి. ఆ పిల్ల తెల్లబారిపోయింది, కళ్ళు భయంతో పెద్ద వయ్యాయి. కాని ఆ పిల్ల నా చేతిని వదిలిపెట్ట లేదు, తనవేపుకు నన్ను లాక్కొంది.

ఈ ఊత నాకు రెట్టింపు బలం యిచ్చిందనిపించింది. ఆందోళనతో నా చెవులు మోతపెడుతున్నాయి. గడ్డకట్టుకపోయిన ప్రపంచం నన్ను పెనవేసుకుంది. అది చాలా రొదచేస్తోంది. కుర్రవాళ్ళు గోలెత్తేరు, కాకి కాకా అంది, ఎక్కడో ఒక ఆవు అంతులేకుండా అంబా అని అరుస్తోంది. "అదెందుకక్కడ వుంది?" అన్న ఆలోచన నా తలలో పరుగెడుతోంది.

మంచులోనుండి పాకుకుంటూ బయటికివస్తే, పూర్తిగా తెరచుకు వున్న కళ్ళతో పిల్లలు, ఒక నిమిషం క్రిందట వున్నట్టుగానే గడ్డకట్టుకపోయి వున్నారు. కొందరు దగ్గరగా వున్నారు, పెద్దవాళ్ళను తీసుకరావడానికి తాము పరుగెత్తుకుని వెళ్ళిన దిబ్బమీద వున్నారు.

"చలికాచుకుందాం, పద" అన్నాను గాల్కాతో, యిద్దరం నీట్లో వున్నట్టుగా.

వాస్తవానికి ఆ పిల్లకు్కూడా చలికాగడం అవసరం. నా రక్షకురాలి పళ్ళు చలికి పటపటలాడి పోతున్నాయి.

మా అమ్మ ఏమీ కనిపెట్టకుండానే చలికాచుకోగలిగాను, నా ఆటల బట్టలు పొడిచేసుకోగలిగాను. "చిన్న పిల్లే, అయితే చాలా ధైర్యవంతురాలు"అనుకున్నాను నాలో నేను, ఆ సాయంత్రం యింటికి వస్తూ.

బహుశా ఆనాటినుండే గాబోసు, యీ "అబల"లనబడే వాళ్ళపట్ల నాకు గౌరవం హెచ్చింది.

మర్నాడే మళ్ళీ నేను కుర్రవాళ్ళలో ఆ చెరువుమీద స్కేటింగ్ చేశాను. ఆ ప్రమాదకరమైన చోటును జాగ్రత్తగా తప్పుక తిరగడం నిజమేననుకోండి.

పిల్లలంతమంటికీ బాగా యిష్టమైన పనేమిటంటే, సినీమాలకు వెళ్ళడం. కొన్ని సినీమాలైతే మేము యిరవైసార్లు కూడా చూశాం. టిక్కెట్లు కొనుక్కునే భోగాలవంటివాట్ని మేం తిరస్కరించాం, ఒక నియమంగా. టిక్కెట్లు కొనుక్కునేవాళ్ళకు తెలియనటువంటి పద్ధతుల్లో, మేము హాలులోకి ప్రవేశించేవాళ్ళం.

జూలెస్ వెర్నె నవల ననుసరించి తీసిన వింత దీవి అన్నది, మొదట్నుంచీ చివరిదాకా నాకు జ్ఞాపకం వున్న మొదటి సినీమా. దీనివెంబడే పార్ఖొమెంకో కూడా వేశారు. ఈ రెండోది మాలో చాలా ఉత్సాహం కలిగించింది, బాహాబాహీ పోట్లాటలు దాన్లో ఎక్కువగా వుండడం చేత.

బాగా చిన్నప్పుడే నేను చదవడం మొదలుపెట్టాను. చాలా చదివేను. నా చదువుగురించి మా నాన్నగారు ఎలాంటి సలహాలిచ్చినా నియమమంటూ లేకుండా నేను పుస్తకాలు ఎంచేవాణ్ని తరచు. నన్ను పూర్తిగా వశపర్చుకున్న మొదటి పుస్తకం, ఇద్దరు కెప్టెన్లు. కవెరిన్ పుస్తకాన్ని నేను ఒక్కబిగిని చదివేశాను. మా నాన్నకూ అమ్మకూ కనిపించకుండా ఒక మారుమూలను కూచొని. అప్పుడే నేను జామెట్రీ పరీక్షకు తయారవవలసి వుందాయెను.

నాలో ఆసక్తిని రేకెత్తించిన మొదటి యంత్రం, మామూలు సినీమా ప్రొజెక్టర్. మా గ్రామపు క్లబ్బులో సినీమాలు చూపించేటప్పుడు, తరచు నేను ఆపరేటర్‌కు దగ్గరసా కూచొని అతని పనిని జాగ్రత్తగా గమనిస్తూ వుండేవాణ్ని. ఆ యంత్రాన్ని బాగా ఆకళింపు చేసుకున్నదాకా నాకు తృప్తి కలగ లేదు, అతనికి సహాయం చేయడం మొదలు పెట్టాను. ఆ తరవాత నేనే ఫిల్మును నడిపేవాణ్ని.

సినీమాల తరవాత కార్లు నడపడంలో ప్రావీణ్యం సంపాదించాను. ఆ తరవాత పాఠశాల విద్యుచ్ఛక్తి జనరేటర్ మీద పడ్డాను. అది తరచు చెడి పోయేది, ఉత్సాహులమైన యిద్దరు ముగ్గురం నెలల తరబడిగా "అత్యవస రపు మరమ్మత్తు" జట్టుగా వుండేవాళ్ళం.

పై తరగతులకు వెళ్ళడంతో రేడియోలో మాకు ఆసక్తి కలగడం మొదలయ్యింది. మా ఉపాధ్యాయులు చాలావరకూ దీనికి కారకులు. గణిత శాస్త్ర విషయాల్లో స్వతంత్రంగా ఆలోచించమని ఇవాన్ వాసిలేవిచ్ కాలిష్ నేర్పుతోనూ, ఓపికగానూ మాకు భోదించారు. మా పద్ధతిలో మేము ఏదో ఒక థీరంను నిరూపిస్తే ఆయన సంతోషపడేవారు. ఆయన కొత్త విష యాల్ని ఏవిధంగా బోధపర్చేవారంటే, ఆ సూత్రాలన్నీ, ఆ థీరంలన్నీ ఆయనే కనిపెట్టేరా అని అనిపించేది. ఆయన స్వభావం విద్యార్థుల్ని ఆకర్షిం చేది, ఆయన చెప్పేదాన్లో వాళ్ళకు యిష్టం కలిగించేది.

సెమ్యోన్ నికొలెయేవిచ్ వన్యుష్కిన్ క్లాసయ్యేక మాతోబాటుగా గంటల తరబడిని కూచొని, పాఠశాలకు చెందిన రిసీవర్లనీ, లౌడ్ స్పీక ర్లనూ కలిపి పెట్టేవారు.

నా చదువు అద్భుతంగా సాగిపోతోంది. తొమ్మిదో తరగతి వచ్చే సరికి నాకు ఘనం అన్న గుణం తప్ప యింకోటి రావడానికి వీల్లేదనీ, ఒక పతకంకూడా తప్పదనీ అనిపించింది, కాని అనుకోనిదొకటి జరిగింది. అది మొదట నా మార్కుల్ని పాడుచేసింది, తరవాత బహుశా అది నా జీవి తాన్నే మార్చిందేమో.

మా నాన్నగారి సైకిలు ఎప్పుడూ నాప అభిమానపాత్రంగా వుండేది. నానారకాల వ్యాయామాలకూ, శిక్షణకూ నేను దాన్ని సాధనంగా చేయడానికి

ఉద్దేశపడ్డాను. నాతోడివారు, ముఖ్యంగా పై తరగతులవాళ్ళు నదరయ్యేటట్టు పొడవుగా, పల్చగా పెరిగిపోతున్నారు. లెక్కలోకి రాని నా విగ్రహంతో నేను చేయగలిగేదేముంది? నేర్పు, ఓర్పు, బలం మాత్రం.

అంచేత వేసవిలో యించుమించు ప్రతిరోజూ సైకిలుమీద సుమారు నూరు కిలోమీటర్లు వెళ్ళేవాణ్ణి, ఒకొక్కప్పుడు నేను అనుకున్న త్రోవలోనూ, యింకొకప్పుడు మా అమ్మ పంపిన పనులకోసమూ. రొట్టెకోసం దుకాణానికి వెళ్ళడం ఒక చిటికతో సరి. కాని నేను సైకిలెక్కి ఒక దూరపు గ్రామానికి గతకల తోవలో ముప్ఫయి కిలోమీటర్లు వెళ్ళేవాణ్ణి. నా నూరు కిలోమీటర్లూ సరిపోవడానికి, ముప్ఫయ్యయిదు కిలోమీటర్ల దూరంలోని మయిస్కాయి ఉత్రోలో వున్న మా తాతగారివద్దకు అడ్డంపడేవాణ్ణి. పది నిమిషాలపాటు విశ్రాంతి సమయాన్నీ, ఆ దూరి త్రోవలో వున్న ఒక అందమైన తావులో గడిపే వాణ్ణి. అక్కడ దట్టమయిన బిర్చ్ చెట్ల తోపొకటుంది, కంచె తీరులో వరుసగా. వేసవిలో అయితే దాని చుట్టూరా పచ్చని గోధుమ సముద్రం. గాలి మెల్లగా కదిలి, కంకుల్ని కెరటాలుగా మార్చివేస్తుంది. బిర్చ్లు ఊగిసలాడ్, తమ ఉంగరాల జుట్టు తలలను ఊగిస్తాయి, ఉన్న చోటే గట్టిగా నిలబడి వుంటూనే. అవి అక్కడే వుంటాయి, గర్వంగా, నిష్కల్మషంగా.

మా ప్రాంతాల్ని తలుచుకుంటే, ఎప్పుడూ అవి నా మనసులోనికి వస్తాయి.

అప్పుడప్పుడే మొదటి పరీక్ష అయ్యి మేమింకా బడిలోనే తచ్చాడుతున్నప్పుడు, వసంతకాలంలో ఒకరోజున, మా క్లిష్టసమస్యకు సరైన జబాబు వచ్చిందో తెలుసుకోవడానికి, మా స్నేహితులు బ్రాకీన్ టేబుల్సు నన్ను తెమ్మన్నారు.

ఒక్క నిమిషం అయ్యేసరికి మా గ్రామం వీధిలో నేను ఎగిరి పోతున్నాను. అలా వెళ్తొంటే బాగా బలిసిన కోడొకటి, అదెక్కణ్నుంచి ఊడి పడిందో తేలీదుగాని, నేరుగా వెళ్ళి నా మొదటి చక్రం కిందపడింది. దాంతో నేను హాండిల్ బార్ మీదనుండి ఎగిరిపోయి, నేలమీద పడిపోయాను. నా ఎడమ చేతిమీద విపరీతమైన బాధ. లేవలేక పోయాను.

ఇంట్లోంచి ఒకావిడ, యీ చప్పుడుకు పరుగెత్తుకొచ్చి, నన్ను తిట్ట

దానికి లంకించుకుంది. అయితే బాధకు నా గొంతుకకూడా పెగల లేదు. పెద్ద ప్రయత్నంతో లేచి, నా చేయి చూసుకున్నాను. విరిగిపోయింది. కష్టం మీద ఆసుపత్రి చేరుకున్నాను. అక్కడవాళ్ళు పలాస్త్రి వేశారు. పరిక్షనుండి పుట్టెడు బరువు పలాస్త్రీతో యిల్లు చేరుకున్నానన్న మాట. ఎముక మెల్ల మెల్లగా అతుక్కుంటోంది, పట్టుదలగా చేతితో వ్యాయామం చేయడం మొదలు పెట్టాను. శాశ్వతమైన చెడుగు ఏవీ జరిగే అవకాశం లేకుండా రకరకాల వ్యాయామాలు ఆలోచించి, దానికి నేను శిక్షణనిచ్చాను.

పట్టం చేతికి వచ్చిన మహత్తర దినంవాడు నా బాల్యమూ, యవ్వనంలోని తొలి ఏప్పూ ముగిశాయి. ఆ రోజు బాగా జ్ఞాపకం వుంది నాకు. ఆ పగటి పూట, నా స్నేహితుడు మిషా కరపోత్కిన్, నేనూ ట్రక్కు మీద వంట చెరకుకోసం దూరంగా వున్న అడివి కెళ్ళాం. పాఠశాలలో జరిగే ఉత్సవాన్ని అందుకోవడానికి తొందరగా తిరిగి వెళ్ళాలని ప్రయత్నించాం; మా పాఠశాల విద్యుత్తు యంత్రాన్ని నడపడానికని.

మా ట్రక్కు మోటారు బాగా వేడెక్కిపోయింది. రోడ్డంతా గతకలు. ట్రక్కు పైదాకా కట్టెలు. కొన్ని కిలోమీటర్లు తంటాలు పడి, మోటారు చల్లబడడానికి మేము ఆగేవాళ్ళం, తరవాత మళ్ళీ బయలుదేరే వాళ్ళం.

పాఠశాలలో ఉత్సవం మొదలవడానికి కొద్ది నిమిషాలు ముందుగా, మేము గ్రామానికి వచ్చాము. కట్టెల్ని తొందరగా దింపేసి, పాఠశాలకు పరిగెత్తాము. మిషా గదిలోకి మొదట పరిగెత్తాడు. ఇగ్నీషన్ టెర్మినల్ స్పార్క్ ప్లగ్గుమీద లేదని మేము గమనించలేదు. అది సరిగ్గా మోటారు మీద వుందని చూడలేదు. మోటారు గాసొలైన్‌తో తడైవుంది. మేము లేకుండా మావాళ్ళు మోటార్ని నడపడానికి ప్రయత్నించారు, కాని ఆ పని చెయ్యలేకపోయారు. మిషా క్రాంకు తిప్పాడు. మా పాఠశాలకు గర్వకారణమైన విద్యుత్తు యంత్రం భగ్గున మండింది. చడీచప్పుడూ లేకుండా, గాభరా పడకండా చేతికి దొరికిన ప్రతి ఒక్క దానితోనూ—మా జుబ్బాలతోనూ, యిసకతోనూ మంటనార్పి, ప్లగ్గును తుడిచి, కరెంట్ తిప్పాము. మసితో నల్లబారి కాలిన మా జుబ్బాలు చేతుల్లో దాచిపెట్టి నిప్పు దగ్గర్నుంచి తిన్నగా పట్టం పుచ్చుకోవడాని కెళ్ళాం.

# ఐదో సముద్రానికి దారి

నిజం చెప్పాలంటే, నా జీవితమంతా సజ్జనుల వేపుకు దారి చూపింది, యిప్పటికీ దారి చూపుతోంది. మైస్కాయి ఉత్రోలోనూ, పోల్కోవ్నికోవో లోనూ యిదే జరిగింది. ఈ చోట్ల నా ప్రాయమే గల, ధైర్యమూ, నిజాయితీగల సహవాసుల మధ్య వున్నాన్నేను. ఈ చోట్ల ప్రతి సమయంలోనూ శ్రద్ధ, మంచి తనమూ గల పెద్దవారు మా చుట్టూరా వుండేవారు. నా భావి పథాన్ని నిర్ణయం చేసిన రోజున, బర్నౌల్‌లోని జిల్లా సైనిక రిజిస్ట్రేషన్ కార్యాలయం వద్ద జరిగిందీ యిదే.

నేనప్పటికే వైమానికుణ్ని కావాలని నిశ్చయించుకున్నాను. ఆ నిశ్చయం చేసుకున్ననాడే, సాధ్యమైనంత తొందరగా విమానంలోనికి యెక్కి, ఆకాశంలోకి వెళ్ళిపోవాలని తహతహలాడిపోయాను. నౌకా శాఖలోకా, వైమానిక శాఖలోకా ఎక్కడికెళ్తావని, రెండోసారి జిల్లా రిజిస్ట్రేషన్ కార్యాలయంలో వాళ్ళడిగినప్పుడు, "వైమానిక పరిషత్తులోకని వ్రాయండి" అని జబాబు చెప్పాను.

"నువ్వు నిజమైన వైమానికుడివి అవుదామనుకుంటే" అని కెప్టెన్, 'నిజమైన' అన్న మా ట ను నొక్కి పలుకుతూ, (అతని పేరు నాకు తెలియదు) "యీ కాగితం తీసుకుని, ప్రాథమిక శిక్షణా పాఠశాలకు దరఖాస్తు చెయ్యి" అని చెప్పాడు.

"ప్రాథమిక శిక్షణా పాఠశాలం"టే ఏమిటో నాకు తెలియదు. వైమానిక పరిష[త్తుల గురించి విన్నాను, ఏదో రకపు "శిక్షితు"లను కాకుండా వైమానికులకు తర్ఫీదు నిస్తాయనీ తెలుసు. అంచేత వెంటనే వైమానికుణ్ని కావాలని నిశ్చయించుకున్నాను. "ఒక పరిషత్తులోకి వెళ్ళాలని నాకుంది

కాబట్టి 'పరిషత్తులోకి' అని వ్రాయండి" అని ఖచ్చితంగా చెప్పాను.

"నీ మంచికే, పిచ్చివాడా !" అంటూ కెప్టెన్ పట్టుపట్టాడు.

కానైతే నేనూ వదిలిపెట్టలేదు. "పరిషత్తే, యింకేదీ ఒద్దు !" అన్నాను.

"బాగుంది, చూద్దాం"అన్నాడు కెప్టెన్, కాస్త వింతగా చిరునవ్వుతూ. తరవాత నన్ను ఒదిలిపెట్టేశాడు.

కార్యాలయంలో రొద కొద్దిగా తగ్గేక, ఆ సాయంత్రం మమ్మల్ని ఒక పెద్ద హాలుల్లోకి పిలిచారు, నియామకాల జాబితాను చదివేరు. ప్రాథమిక శిక్షణా పాఠశాలకు పంపబడుతూన్న వారందరి పేర్లూ విన్నాను. వారిలో నా పేరులేదు. బ్రతికానురా అని నిట్టూర్పు తియ్యబోతోంటే కెప్టెన్ "తితోవ్, గెర్మన్ స్తెపనోవిచ్ !" అంటూ చదివాడు.

ఆ తరవాత కాస్త కటువుగా ఆయన "జిల్లా సైనిక సంఘం యీ జాబితాను ఆమోదించింది, ఏ మార్పులూ చేయబడవు."

"అయితే, అతను తను అనుకున్న పని చేశాడు !" అని నాలో నేను అనుకున్నాను కోపంగా. తరవాత, చాలా నెలలు తరవాత మాత్రమే, ఆ నేనెరగని కెప్టెన్ నాకెంత మేలు చేశాడో గ్రహించాను.

మా సందడి గుంపు పది మందిమి బర్నౌల్ నుండి బయలు దేరాం. తోవలో ఒక మాదిరీ "సైబీరియన్ శాఖ"ను నిర్మించుకున్నాం. అంతా కలసి పాఠశాలలో చేరాం.

ఈ పాఠశాల మొదలై యిది రెండో ఏడు. ఇన్‌స్ట్రక్టర్లకూ, ఇంజినీర్లకూ, సాంకేతిక నిపుణులకే సరిపడా యిళ్ళూ, బేరక్కులూ లేవు. మాకు నేలలో దొల్చిన కూపాల్లో బస. నిజం చెప్పాలంటే "బస" అన్నది చాలా అతిశయోక్తి. ఎవ్వరూ మాకోసం వీటిని సిద్ధపర్చి పెట్టలేదు. మేమే కట్టుకున్నాం. ఈ పని నన్ను నిరుత్సాహ పర్చనూ లేదు, భయపెట్టనూ లేదు కాస్తంతైనా. సమిష్టి క్షేత్రంలోనూ, యింట్లోనూ మా అమ్మకు సాయం చేస్తూ పని చేయడం నా కలవాటే. ఏమైనా, ఆరోగ్యం గల యువకుడికి పలుగుతో పని చేయడమూ, బరువైన దూలాలు ఎత్తడమూ యిష్టమే అవుతుంది, తన భావి "సదుపాయం" కోసం. కాబట్టి సైన్యంలో నేను గడిపిన



రోదసీ నౌకా చోదకునికి ఎన్నో విషయాలు తెలిసివుండాలి.

తొలి రోజులు నాకు కులాసాగానే వున్నాయి.

ప్రాథమిక శిక్షణ మొదలై, మమ్మల్ని యుద్ధ శిక్షణలో పెట్టి, మాకు పనులు నిర్ణయించడమూ, యుద్ధ నిబంధనలను నేర్చుకోమనడమూ చేసినప్పుడు, నాకు నిజంగా విసుగెత్తింది. భావి వైమానికుణ్నయిన నేను వీనిని వెంటనే నిరుపయోగం అనేసుకుని, వాట్ని నేర్చుకోవడానికి ప్రయత్నం చేయలేదు.

ఈ రకపు దృక్పథం వల్ల నేను చాలా నష్టపోవలసి వచ్చిందనుకోండి. ఒక రోజు నేను డ్యూటీలో వున్నాను. నా కప్పగించిన రెండు గంటలూ గార్డుగా నిలబడి, తరవాత బట్టలు విప్పేసుకుని, మంచం ఎక్కాను.

కాస్సేపటికి ఎవరో కుదుపుతున్నట్టనిపించింది.

"ఎందుకు నిద్రపోతున్నావు ?"

"నా పని చేశాను, అంచేత పడుకున్నాను".

ఆఫీసరుకు కోపం వచ్చింది, అరుకుని "యుద్ధ నిబంధనల్లో ఏమనుంది ?" అని అడిగాడాయన.

"నాకేం తెలుసు?"

"నీకు తెలిసేందుకు, నీకున్నది కాక యింకో రెండు డ్యూటీలు చెయ్యి!"

అదనపు డ్యూటీలు చేస్తూంటే, నాకు దుఃఖం వచ్చింది. కలం తీద్దామనిపించింది; పరిస్థితులు నేను మొదట అనుకున్నట్టుగా లేవనీ, విమానాలు నడపడం కాకుండా, ఆయుధాలు ఉపయోగించడమూ, డ్రిల్లూ నేర్పుతున్నారనీ మా నాన్నగారికి రాశాను. మొత్తంమీద కాస్త బాధగా వ్రాశాను. నాన్నగారి జవాబు ఎప్పట్లాగానే శాంతంగానూ, నచ్చజెప్పుతూనూ వుంది. "సైన్యములో సుఖవుగా వుండదని ముందరే నేను నీకు చెప్పాను. కాని నువ్వు నా మాట వినకుండా, యిది ఎంచుకున్నావు. కాబట్టి దానికే అంటి పెట్టుకుని వుండు, తరవాత యీ పిరికి తనానికి సిగ్గు పడకుండా వుండాలంటే."

ఈ ఉత్తరం "నేలమీది" సైనిక ఘన కార్యాలకు నన్ను ఉత్తేజపర్చిందని చెప్పలేను. కాని అదృష్టవశాత్తూ మేము తొందర్లోనే విమానాల సాంకేతిక విషయాలగురించి తెలుసుకోవడం మొదలుపెట్టాము, యిబ్బందులన్నీ మర్చిపోయాము. సాంకేతిక విషయాలంటే నాకు యిష్టం. కుర్రవాడుగా వున్నప్పుడే నన్ను ట్రాక్టర్లూ, కార్లూ ఆకర్షించాయి. కాబట్టి నేను ఆతృతగా విమానం గురించీ, దాని మోటారు గురించీ తెలుసుకున్నాను. నా పేరుకు ఎదురుగుండా వ్రాయబడిన ఘనం అన్న మార్కు, పెద్దగా శ్రమ పడకుండానే వచ్చింది. నౌకాయానం గురించీ, అంతరిక్ష శాస్త్రం గురించీ అదే తృప్తితోనూ, ఆసక్తితోనూ తెలుసుకున్నాను.

యల్-18 లో నా తొలి శిక్షణాయానంగురించీ, తొలిసారి ఒంటరిగా నేను విమానాన్ని నడపడం గురించీ నాకంతగా యిప్పుడు జ్ఞాపకం లేదు. "చెల్యుష్కిన్" శిబిరంలో మా ధృవ మండలాల యాత్రీకులు సాధించిన విజయాల్ని పుస్తకాలలోనూ, కథలలోనూ, ఫిల్ములలోనూ బాల్యం నుండీ మా తరంవారు తెలుసుకోవడం, యిందుకు కారణమనిపిస్తోంది నాకు. ఇందువల్ల విమానయానం మామూలైపోయింది. అంచేత మేము విమానాల్ని ఊపిరి బిగపట్టుకుని, నోళ్ళు వెళ్ళబెట్టి చూడం.

అపారమైన స్టెప్పీల దృశ్యమూ, వాటిమీద మా పార్టీ, మా ప్రజలూ

అప్పుడు ప్రారంభించిన బ్రహ్మాండమైన పనీ చూసి సంతోష పడడం, ఒక్కటే నాకు జ్ఞాపకం, మేము విమానాల్లో బయలు దేరినప్పుడు.

మా యాత్రలు 1954 వసంతంలో మొదలయ్యాయి. అప్పుడు బీళ్ళను దున్నడం మొదలయ్యింది ప్రతిచోటా, సోవియట్ ప్రజల బ్రహ్మాండమైన కృషి పైనుండి మరీ స్పష్టంగా కనబడింది.

ఉదాహరణకు ఉదయమే బయలుదేరుతాం విమానం మీద. ఎక్కడో స్టెప్పీకి దూరంగా, దున్నిన భూమి సన్నని గీతగా కనిపిస్తుంది. ఈ భూమికి చివర ట్రాక్టరు నల్ల కుమ్మరి పురుగులాగా పాకుతూ, నాగలిని క్షితిజ రేఖకు ఆవల లాగుతూ వుంటుంది. సాయంత్రానికల్లా ఆ గీత దట్టమైన ముద్ద అయిపోతుంది. ఆ తరవాత రోజు, దానికి తరవాత రోజు ఆ ముద్ద, విస్తరిస్తూ పోయి ఆకాశం ఒక చివరనుండి యింకో చివరకు వ్యాపిస్తుంది. తరవాత దున్నిన భూమికి పచ్చని నీలాలలాంటి మొలకలు అలముకొంటాయి. హేమంతం వచ్చేసరికి, కనీకనిపించకుండా, అయినా బాగా ప్రస్ఫుటంగా పసుపు బారతాయి. యాక్-18 మీద మా కార్యక్రమం ముగిసేటప్పటికి, స్థావరాలలోని కుప్పలు పోసే యంత్రాలవద్ద బ్రహ్మాండమైన బంగారు ధాన్యపు రాసులుగా అవి మారిపోతాయి.

మా సిద్ధాంత శిక్షణతోనూ, విమానయానపు శిక్షణతోనూ మేము తీరుబడి లేకుండా వుండడం వల్ల, సాయంత్రం అయ్యేసరికి ఎంతగా అలిసిపోతామంటే, మేము చేయగలిగేదల్లా యిక మా కూపాల్లో ప్రవేశించి మంచాలమీద పడిపోవడమే, ఉదయం మళ్ళీ విమాయానపు మండలంలో వర్తులంగా ఎగరడానికి వెళ్ళడమే. ఈ విధంగా ఎగరడం నేర్చుకోవాలి మేము, ఏయిబ్బందీ లేకుండా మేము పరిషత్తులోనికి ప్రవేశించాలంటే. మా శక్తులన్నిట్నీ ఉపయోగించి మేము ప్రయత్నించాము, కాని మా బోధకుడు ఎప్పుడూ నా విషయమై అసంతృప్తితో ఉండడం నేను గమనించాను. మలుపులను నాకు చాతనైనంత సరిగ్గానూ, తూచ తప్పకుండానూ లెక్కగట్టడానికీ ప్రయత్నించాను. నేను బాగానే ఎగురుతున్నానని అనిపించింది నాకు, ఏమైనా యితరులకు తీసిపోకుండా ఎగురుతున్నాననిపించింది, కాని గొనిషెవ్, యిదీ అని ఏ విషయమూ చెప్పకుండా, యింకా తృప్తిపడలేదు.

"నిన్ను చూస్తుంటే, యీసారి నువ్వు ఎలా విమానం నడుపుతావో ఎవ్వరూ చెప్పలేరు."

ఆ తరవాత మాత్రమే, యీ అసంతృప్తికి కారణాన్ని నేను గ్రహించాను.

విమానంమీద ప్రావీణ్యం సంపాదించేక, వందల సార్లు బయలు దేదరమూ, నేలకు దిగడమూ సరిగ్గా ఒకేలాగ చేయగలుగుతారు; వందల కొద్దీ సైనిక మలుపులూ, లూప్స్, రోల్సు ఎంతమాత్రం తేడా లేకుండా చేయగలుగుతారు. ఇది ఎన్నడూ నా విషయంలో జరగలేదు. ఎగిరేటప్పుడు ప్రతిసారీ నేను కొత్తగా లెక్కవేశాను, విమానయానపు మూల సూత్రాలను మళ్ళీ మళ్ళీ చదివేను. ఒకేలాగున చెయ్యక పోవడం బోధకుడికి అసంతృప్తి కలిగించిందని స్పష్టమయ్యింది.

ఒకసారి అలిసిపోయి చికాకుగా వుంటే, బసనుండి బయటికెళ్ళి, గడ్డిలో పడుకున్నాను. పైని ఆకాశంలో రాత్రి. పాలపుంత నెమ్మదిగా విశ్వమంతటా మెరుస్తోంది. తోకచుక్కలు పడుతూ, భూమిని చేరక ముందరే కానరాకుండా పోతున్నాయి. ఏదో దుఃభావం నన్ను ముంచుకొచ్చింది, హటాత్తుగా. "అంతే! ఈ విమానాలు నడపడం పాడుగాను! ఇన్ఫెంట్రీలో రెండేళ్లూ చేసేసి యింటికి పోతాను. ఏదో విద్యాశాలలో చేరి ఇంజినీర్నో, వ్యవసాయ శాస్త్రజ్ఞుణ్నో, యింకేదో అవుతాను—యిక్కణ్నుండి మాత్రం బయటపడాలి"అని నిశ్చయం చేసుకున్నాను.

ఈ నిశ్చయం చేసుకున్నాక ఒక నిముషం తరవాత హాయనిపించింది. రిపోర్టు రాయడానికి కూపంలో వెళ్ళబోతుంటే, హటాత్తుగా అంతా ఆగిపోయినట్టనిపించింది నాలో. దూరంగా, మా క్లబ్బు వేపునుండి, నాకు చిన్నప్పట్నుండీ తెలిసిన డ్వోరక్ కమ్మని సంగీతాన్ని గాలి తీసుకవచ్చింది. అవును అదే, పాఠశాలనుండి అలసిపోయి యింటికి వచ్చి సాయంత్రాలప్పుడు మా నాన్నగారు ఎంతో యిష్టంగా వాయించే స్లావ్ నృత్య సంగీతమే. మా చెల్లి, నేనూ చప్పుడు చెయ్యకుండా పూరుకునేవాళ్ళం, యిది నాకు జ్ఞాపకం వుంది. మా నాన్నగారి సంగీతానికి భంగం కలుగుతుందనీ, ఆ బరువులేని కమాను వేలిక కదలికలను చెడుపుతుందనీ మా భయం.

మాకు ప్రేమ లభించే మా యిల్లు నాకు మనసులోకి వచ్చింది, ఒక క్షణకాలం. అక్కడికి వెళ్ళాలనిపించింది తొందరగా, మా నాన్నగారి దగ్గరికి. నేను తలుపు తెరిచేసరికి ఏమి జరుగుతుందో నేను ఊహించుకోగలను. "ఎవరది" అని నాన్నగారంటారు, ఫిడేలు పెట్టేసి. "వచ్చేశావా, నాయనా? వైమానికుడు కావొద్దనుకున్నావా, లేకపోతే వైమానికుడివి అయిపోయావా అప్పుడే?"

నేను పుట్టిన యింటి తలుపును తెరుస్తూ, ఆయనకు ఏమని చెప్పేది? ధైర్యం చెడిందనీ, నేను విమానాన్ని నేలకు దింపడం బాగా జరగడంలేదనీ చెప్పగలనా? "తలుపు వేసే ముందర, మళ్ళీ నువ్వు ఎలా దాన్ని తట్టబోతున్నావో ఆలోచించుకో"అన్న ఒక ఇంగ్లీషు సామెత జ్ఞాపకం వచ్చింది— నేను పాఠశాల తలుపును వెయ్యలేదు.

యాక్–18 మీద ఎగిరే కార్యక్రమం పూర్తయ్యేక, యింతకంటె వేగంగా పోయే యాక్–11ను మేము నడపడం మొదలు పెట్టాము. విమానాలు నడపడం నాకు అసాధ్యమైన పనికాదని అప్పుడు నేను గుర్తించాను. ఇంకో మంచి వ్యక్తి ఇన్‌స్ట్రక్టర్ కిసెలెవ్ మాకు బోధించడంవల్ల కావొచ్చునిది. ఈయన చాలా ఖండితమైన, పట్టుదల గల వైమానికుడు.

"ప్రతి ఒక్క విషయానికీ మీకు మీరే ఎప్పుడూ బాధ్యత వహించగల ఫైటర్ పైలెట్లను చేస్తాను మిమ్మల్ని. కొన్నిసార్లు ప్రాణాలొడ్డవలసి వస్తుంది మీరు. మీ ప్రాణాలేకాదు, మీ స్నేహితుల ప్రాణాలు కూడా. మీరు నేలమీద మందబుద్ధులయితే, గాలిలోనూ అలాగే వుంటారు." ఆ సరికి నేను చిన్న ఆఫీసర్ని. మా బృందాల్లోని విద్యార్థులు బూట్లను పాలిష్ చేసుకోరపోయినా, బొత్తాయిలు వూడిపోయినా, దుస్తులు శుభ్రంగా లేకపోయినా కిసెలెవ్ నన్ను మందలించేవారు. ఒకసారి కిసెలెవ్ ఏదో చెప్పారు, ఆయన అది మళ్ళీ చెప్పలేదు. బృందంలో పరిస్థితులు సక్రమంగా లేవని ఒకరోజాయన గమనించి, నేను విమానంలో వెళ్ళడానికి అనుమతి నిరాకరించారు. ఏమి చెయ్యకుండా చాలా సేపు నేను బసలో రోజల్లా పచారీ చేశాను; ఆ మర్నాడూ, దానికి తరవాత రోజూ కూడా. నాలుగోరోజు స్క్వాడ్రన్ వైస్-కమాండర్ మేజర్ తోనిన్ తలుపు తట్టాడు.

"నువ్వెందుకు విమానంలో వెళ్ళడం లేదు?"

"నాకు తెలియదండీ...."

"అయితే సరే, నీ విమానంలోకి ఎక్కు!"

యాక్-11 లో ఎవరి స్థలాల్లో వాళ్ళం కూచున్నాం. దీపం ఆర్పబడింది, తోనిన్ ఆజ్ఞ యిచ్చారు, "బయలు దేరండి!"

విమానం కంట్రోల్సును యీ మూడు రోజులూ పట్టుకోకుండా వుండడం వల్ల, నేను వాచిపోయినట్టుగా యాక్‌ను ప్రత్యేకమైన సంతోషంతోనూ, నేర్పుతోనూ ఆకాశం లోపలికి తీసుక వెళ్ళాను.

మేము భూమిమీదకి వచ్చేటప్పటికి తోనిన్ "బహు బాగా వుంది" అన్నారు. "మీరు విమానం నడపగలరు."

మా బృందంలో మంచి క్రమం వచ్చిందో, లేకపోతే మేజరూ, కేప్టెనూ ఏమి మాటాడుకున్నారో ఏమోగాని, ఆ రోజునుండీ విమానంలో వెళ్ళకుండా నన్నెవ్వరూ అడ్డు పెట్టలేదు. నేను తొందర్లోనే నా మొదటి పోరాటపు అభ్యాసానికి వెళ్ళాను.

చాలా మంది ఇన్‌స్ట్రక్టర్లు నన్ను తీర్చి దిద్దారని తరవాత తేలింది. వీళ్ళంతా ప్రముఖ వైమానికులు, మంచి ఉపాధ్యాయులు, వీరంతా యిటీవలి యుద్ధపు కఠిన కాలంలో తాము నేర్చుకున్న దాని నంతట్నీ మా విద్యార్థులకు నేర్పడానికి ప్రయత్నించారు.

మా నాయకుడు కెప్టెన్ మాక్సిమోవ్ నాకు జ్ఞాపకం వున్నారు. గాలిలో ఆయనతో పోరాటానికి వెళ్ళడం కష్టమైన పనీ, ఆసక్తి పుట్టించే పనీ. ఎంచేతంటే ఆయన ఎప్పుడూ ఎటువంటి పరిస్థితులు కల్పిస్తుంటుంటారంటే, గమనించికుండానే జాగ్రత్త తీసుకోవడానికి అలవాటుపడిన పరికరాల గురించి జాగ్రత్త తీసుకోవడమే కాకుండా, నేలమీదనున్న నియంత్రణాధికారి నియంత్రణలో వుండాలి కూడాను. ఆయన అప్పుడప్పుడు, తాను గాలిలో ఒక్కరే వున్నట్టుగా గమ్మత్తులు చేసేవారు. మాక్సిమోవ్ యిది పోరాటంలోనే కాకుండా, త్రోవలో, విమానయాన మండలంలోనూ చేసేవారు.

వెయ్యి మీటర్ల ఎత్తున ఒకసారి నేనూ, ఆయనా జతగా ఎగురు

తున్నాం. వాతావరణం అద్భుతంగా వుంది. హేమంత కాలపు పొలాలమీద మా యాక్‌లు ఎగురుతున్నాయి,-మృదువుగా. అలవాటు ప్రకారం నేను ఒక సెకండు కాలం భూమివేపు చూశాను, అక్కడ ఏదేనా కొత్త సంగతి జరుగుతూ వుందా అని. ఒక లిప్త కాలానికి ఎక్కువగా నేను నా నాయకుని ఏమారి వుండివుండను. కాని నేను ముందుకూ, ఎడమకూ చూసేటప్పటికి దిగ్భ్రాంతుణ్ణయ్యాను. ఇన్‌స్ట్రక్టర్ వరుసలో లేరు.

మేము విమానాశ్రయంవేపుకు వెళ్తున్నాం. తన నాయకుడు లేకుండా నియంత్రణాధికారికి నివేదన చేయడం సిగ్గుచేటు—ఆయనెక్కడికి వెళ్ళిపోయారు ? ఆయనకోసం ఎక్కడ వెతకడం ?

నేను యాక్‌ను దాని రెక్క కొనమీదుగా నడిపి, ఎడమకు చూశాను. కాళీ. నేను విమానాన్ని కుడి కొనకు పెట్టాను. ఇప్పుడూ కాళీయే. "ఏమిటీ అసందర్భం" అని నేను నిందించుకుని ఊరుకున్నాను. దూరాన, క్షితిజరేఖ వద్ద, నేలకు ఒక వంద మీటర్ల పైన నేను మాక్సిమోవ్ విమానాన్ని లీలగా చూశాను. నేను తనను అనుసరిస్తూ వుండడం లేదని ఆయన గమనించి, ఇంజిన్‌కు వేగం ఎక్కించి అంతదూరం వెళ్ళిపోయినప్పుడు, నాకేమీ తెలియలేదు. గరిష్ఠ వేగంతో డ్రైవ్‌చేస్తూ నేను మాక్సిమోవ్‌ను అందుకున్నాను, ఆయన విమానపు రెక్కకు పక్కగా బారుతీరి నా విమానాన్ని పెట్టాను, మేము దిగేచోటికి ఆయనతో బాటుగా దిగాను.

నా హెల్మెట్‌నూ, పారచూట్‌ను తీసివేస్తూ విమానాశ్రయంలో ఇన్‌స్ట్రక్టర్‌ను "ఏమిజరిగిం"దని అడిగాను.

"అంతా సవ్యంగానే వుంది. నువ్వు నన్ను అందుకున్నందువల్ల, యిక చెప్పేదేమీ లేదు."

తరవాత విమానంలో వెళ్ళేటప్పుడాయన, యింతకంటె తీవ్రమైనదీ, ఊహించనదీ పరీక్ష ఒకటి కల్పించారు. మళ్ళీ మేము జతగా వెళ్తున్నాము. ముందుగా, ఎడమకు, పది అడుగులు నాకు దూరాన, గాలిలో పోతపోసి వుందేమో అన్నట్టుగా ఆయన యాక్ వెళ్తోంది. ఆయన హటాత్తుగా ఎడమకొక కుదుపు కుదిపారు. నేను ఏదో ప్రమాదం రాబోతున్న



తమారా, గెర్మన్ తమ అభిమాన కవి రచనలను
చదువుతోన్న దృశ్యం.

దనుకున్నాను. ఈ పరిస్థితిలో మా విమానాలు గుద్దుకోవచ్చును. ఎంచేత నంటే యిలా పోవడం తరువాత ఒక తిప్పువస్తుంది. నేను ముందరపున్న దాన్ని గుద్దివెయ్యవచ్చు.

నేను చక్రాన్ని గట్టిగా తోశాను, యిరవై మీటర్లు దిగువకు వెళ్ళి అక్కడ, మాక్సిమోవ్ నుండి దృష్టిని మరల్చకుండా, ఆయనతో పాటే ఎగరడం సాగించాను. ఇప్పుడాయన సమాన స్థాయికి వచ్చి, మళ్ళీ మామూలుగా వెళ్లారు. నేను ఆయనతో సమాన ఫాయకు వెళ్ళాను.

మేము కిందికి వచ్చాక, యాత్ర ఎలా సాగిందని అడిగాను. "అంతా సవ్యంగానే జరిగింది, చెప్పవలసిందేమి లేదు" అని మాక్సిమోవ్ జవాబు చెప్పారు.

మిగ్ జెట్ లో వెళ్ళడం నాకు జీవితమంతా జ్ఞాపకం పుంటుంది.

నన్ను తీసుక వెళ్ళిన విమాన చోదకుడు సెక్షన్ కమాండర్ మేజర్ వ్లాదిమిర్ ఇవనోవిచ్ గుమెన్నికోవ్. ఈయన చాలా ఖండితమైన అధికారి, నియమంగల వ్యక్తి. విమానయానాలు ఏ వేళలో మొదలైనప్పటికీ, ఆయన శుభ్రంగా క్షవరంచేసుకుని, బాగా యిస్త్రీ చేసిన బట్టలు వేసుకుని, తాజాగా కనిపించేవారు. వైమానికులెవరైనా గరుకు గడ్డంతోనో, బాగులేని దుస్తులతోనో వస్తే ఆయనకు చాలా కోపం వచ్చేది.

"సేనలో వున్న మనిషి అన్ని వేళల్లోనూ శుభ్రంగా వుండాలి. వైమానికుడైతే మరీనూ" అన్నది ఆయన నియమం, దాన్ని ఆయన ఎప్పుడూ చెపుతూ వుండేవారు. "మిగ్ లో సైనికుడు ఒకొక్కప్పుడు, నేలమీద చెయ్యని పనులు చేస్తాడు."

ఆయన గొప్ప పనులు చేశారు, ఆకాశంలోనూ, నేలమీదా. ఆ జిల్లా అంతటికీ ఆయన్ను మించిన ఇంటర్‌సెప్టర్ వైమానికుడు యింకొకరు లేరు. ఆయనకంటె సరిగ్గా నేలమీద, గాలిలోవుండే లక్ష్యాలమీద తుపాకీ పేల్చిన వారింకొకరు లేరు. ఆయనకు తరచు ప్రశంసలొచ్చాయి, పెద్ద ప్రశంసలొచ్చాయి. నిజమైన సిద్ధహస్తుడని ఆయన గురించి అంటారు.

నేను మొదట జెట్ విమానంలో వెళ్ళవలసింది యిటువంటి మనిషితో.

"అంతా మీరే చెయ్యండి, నేను సరిచూస్తాను.

లోహంనుంచీ, వేగనుంచీ వచ్చిందేమో అన్నట్టుగా కనిపించే మా చిన్న విమానం రన్‌వే మీదికి వెళ్ళినప్పుడు, నేను మోటారుకు వేగం ఎక్కించాను. నాకు యాక్స్ అలవాటే. బయలుదేరడానికి ముందర ఒక నిమిషంలో చాలా భాగం వాటి నెలా నడపాలో కూడా నాకు అలవాటే. ఇప్పుడు మిగ్ ఎప్పుడు నేల మించి ఎగిరిందో కూడా నేను గమనించనే లేదు. నేను గియర్‌ను పైకి ఎత్తేసరికి, ఐదు వందల మీటర్ల ఎత్తుకు "గంతు" వేసింది. కాని రెండు వందల మీటర్లకు వెళ్ళేటప్పుడు మలుపు తిప్పాలని అజ్ఞలున్నాయి. మొదటి మలుపు తిప్పానోలేదో, రెండో మలుపు, మూడో మలుపు తిప్పవలసిన సమయాలు వచ్చాయి. ఇప్పుడు దిగవలసిన

చోటు ముందరుంది, క్షితిజ రేఖ వేపు. దిగడానికి వేయవలసిన గియర్‌ను దించి నేను భూమిమీదికి వెళ్ళవలసి వుంది. అప్పుడు నాలోవున్న ఆందోళనవల్ల నాకు చెమటలు పడుతున్నాయి. ఇదంతా చాలా సేపు పడుతుందనిపించింది. కాని యీ యాతన వున్నదల్లా పద్నాలుగు సెకండ్లే. "నేనెలా ఎగిరాను ?"అని అడిగితే, ఇన్‌స్ట్రక్టర్ "చాలా బాగుంది! ఎక్కువ వేగంతో వెళ్ళే విమానంలో ఎక్కేటప్పుడు ప్రతి వైమానికుడికీ ఇటువంటివి జరుగుతూనే వుంటాయి. మీకు అలవాటవుతుంది లెండి !" అని చెప్పారు.

కొన్నిసార్లు ఎగిరేక, నేను యీ శక్తివంతమైన మిగ్ వేగానికి అలవాటు పడ్డాను. ఈ యాత్రలో పదునాలుగు సెకండ్లూ నాకు ఒక నిమిషంలా అనిపించాయి. దాని రెక్కల్లో పెట్టబడిన వేగాలకు శరీరం దానంతటదే అలవాటు పడిపోయింది. ఆకాశంలో పోరాటంగురించి మేము మూలసూత్రాల్నీ, నేలమీద నున్న లక్ష్యాల పైని కాల్చడమూ, "శత్రు" విమానాలను వెంటదరమడమూ, వాటిపైని "దాడి చేయడమూ" నేర్చుకోవడం మొదలు పెట్టేసరికి సుడిగాలిలో ఎగరడంవల్ల వచ్చే అనుభవం బాగా రాటుతేలింది.

బలవత్తరమైన జెట్ విమానంలో; ఒక సెకంపులోని ఒక భాగంలో వైమానికునిలో కాలమూ, వేగమూ, హెచ్చుతోన్న మోటారు శక్తీ, ఏ క్షణాన్నయినా అంతులేని ఆకాశంలోనికి విమానాన్ని తీసుకపోయే సామర్థ్యమూ కలసిపోయి వున్నప్పుడు, కఠినమైన "గాలిలోని కవిత"ను అంతట్నీ కలం తీసుకుని కాగితంమీద వ్రాయడం సులుచేమీ కాదు. అసాధారణంగా బలోపేతమైనదీ, నిప్పురవ్వలు కురిపించేదీ ఏదో ప్రవహిస్తుంది శరీరంలోని ప్రతి కణంలోనూ, ప్రతి నరం చివరనూ. మిగ్‌ను యింకా వేగంతో ముందుకు, యింకా యింకా వేగంతో ముందుకు తీసుకపోదామనీ, గాలిలోని దాని రెక్కల బలవత్తరమైన ఒత్తిడిని చటాలున మలుపు తిరిగేటప్పుడు తన కుడి అరిచేతిలో అనుభవించడానికీ ఆపుకోలేని కోరికతో వైమానికుడు గింగుర్లు తిరిగి ముద్దవుతాడు.

ఇప్పుడది గడిచి చాలా కాలం అయ్యింది. అయినా పరిషత్తులోని స్నేహితులూ; మాకు విద్యాబుద్ధులు చెప్పి, అప్పుడప్పుడే దశవర్షపాఠ

శాలలో పట్టాలు పుచ్చుకున్నవారిని వైమానికులుగా తయారు చేసినవారూ నాకు జ్ఞాపకం వచ్చినప్పుడు, ఆ వ్లాదిమీర్ ఇవనోవిచ్ గుమెన్నికోవ్ గురించి నాకు కలిగిన సదభిప్రాయాలను నేను చెప్పకుండా వుండలేను.

జిల్లా సైనిక రిజిస్ట్రేషన్ కార్యాలయంలో నేనెరగని కెప్టెన్ పట్టుబట్టి నన్ను ప్రాథమిక శిక్షణా పాఠశాలకు పంపివుండక పోయినట్టయితే, నేను గుమెన్నికోవ్ అధ్వర్యం కిందికి—విశాల హృదయమూ, ప్రజలతో ప్రత్యక్ష సంబంధమూ, పుస్తకాలనుంచి కాకుండా మాకున్న అవకాశాల విషయమై అంతులేని విశ్వాసమూగల ఆ శక్తి, మౌలికతా సంపన్నుని అధ్వర్యం కిందికి వచ్చివుండేవాణ్ని కాదు. వ్యక్తిగతంగా ఆయన ఎప్పుడూ ఖండితంగానూ, అందుబాటులో లేకుండానూ వుండేవారు. కాని ఆయన ఆంతర్యంలో సున్నితమైన మనిషి, సజ్జనుడు. కొత్తగా వచ్చిన ప్రతి ఒక్కర్నీ పలకరించి నేస్తం కట్టేవారు, రహస్యంగా ప్రేమించేవారు, అభివృద్ధిని కోరేవారు.

ఫాసిస్టులతో భయంకరమైన యుద్ధంలో భారాన్నంతట్నీ మోసిన తండ్రుల బిడ్డలమైన మేము యుద్ధాన్ని ఎరగం. అనుభవంగల యుద్ధ వైమానికుడైన ఆయన యుద్ధం మొదటి రోజుల్లో ఓటమిలోని చేదునూ ఎరుగుదురు, విముక్తితో కూడిన విజయం తెచ్చియిచ్చిన ఆనందాన్నీ ఎరుగుదురు.

ఆయన సాధారణంగా నిటారుగా వెళ్ళే మలుపులు తిప్పేవారు. దాంతో కళ్ళు పచ్చబడిపోయేవి. గుండెకు చక్రాన్ని నొక్కుతూ, యావత్తు ఆకాశపు ఒత్తిడినీ నా పైని పెట్టుకుంటున్నానేమోననీ; నేను గాభరా పడకండా మలుపును యింకా ఎక్కువసేపు తిప్పితే వెంటనే పరిస్థితులు బాగుంటాయనీ అనిపించేది. సుళువో కాదో గాని అప్పటికే నాయకుడు అందుకోరాని ఎత్తుకు దూసుకపోతున్నారు, నన్ను దిగువను పనికి రాకుండా, దిగులులో పెట్టేసి.

మేము ఆయన వెంట యీడ్చుకుంటూ వెళ్ళేవాళ్ళం, కుర్రవాళ్ళమైన మమ్మల్ని ఆకాశంలోకి గుమెన్నికోవ్ లాక్కువెళ్ళిన వేగాలను యీ విధంగా చెప్పడానికి వీల్లేకపోయినా. విద్యార్థి ఎవరైనా తడబడితే ఆయన

కఠినంగా వుండేవారు, కాని తాను అనుకున్నది చేసినట్టయితే ఎంతో ఉదారంగా వుండేవారు.

ఒకసారి ఒక దుస్సంఘటన జరిగింది, నా కుర్రతనం వల్లా, పొగరుబోతుతనం వల్లా. ఒక స్టాఫ్ అఫీసర్ దీన్ని గురించి బాగా ఆలోచించకుండానే "తితోవ్‌ను పరిషత్తునుండి తొలగించాలి! వెంటనే!" అంటూ రిపోర్టిచ్చారు.

బలహీనత ముంచుక వచ్చి విమానయానాన్ని వదిలి పెట్టేద్దామనుకున్నానొకప్పుడు. కాని అదంటే బాగా యిష్టం ఏర్పడ్డాక పరిషత్తునుండి తొలగింపబడడమంటే, నాకొక పెనుముప్పే అది.

నేను నిర్వ్యాపారంగా పరిషత్తులో తిరుగుతున్నాను, కేంద్ర కార్యాలయంలో నా గతి నిర్ణయమవుతూ వుందని బాధ పడుతూ.

"ఎందుకు తల ఒంచుకున్నావు, తితోవ్?" అని కటువుగా ఒక గొంతుక వినిపించింది. గుమెన్నికోవ్ నా ముందర నిల్చున్నారు.

"నేను జీవించలేను అది లేకుండా..."

"నాకు తెలుసు" అని ఆయన నా మాటకు అడ్డం వచ్చి, "కాని అప్పుడే ఆశలు వదులుకోవడం ఎందుకు?" అన్నారు.

తరవాత ఆయన నా దగ్గర్నుంచి వెళ్ళిపోయారు.

ఆ తరవాత మాత్రమే నాకు తెలిసింది గుమెన్నికోవ్ కూడా రిపోర్టు యిచ్చారని, శిక్షణను సాగించడానికి నాకు గల హక్కు గురించి. ఇందువల్ల తోడి అధికారులతో తీవ్రమైన సంఘర్షణ కలగడానికి అవకాశం వున్నప్పటికీ ఆయన యిలా చేశారు. కాని ఆయన పై అధికారులకు నచ్చజెప్పేరు, ఎప్పటిలాగే గట్టిగా, నేను వైమానికుణ్ని కాగలుగుదునని. ఆ మేజర్ విశ్వాసానికి నేను అర్హుణ్నవుదునో, లేదో నాకు తెలియదు. కాని అయినట్టయితే "ఆ సజ్జనుడికి చాలా చాలా కృతజ్ఞుణ్ని" అని యింకోసారి చెపుదామనుంది నాకు.

పరిషత్తులో శిక్షణ అయ్యేక, లెనిన్‌గ్రాడ్ సమీపంలోని దళానికి నేను పంపబడ్డాను. నాతోబాటే శిక్షణను ప్రారంభించిన వారు చాలామందక్క-

డున్నారు. నికొలాయ్ యుర్నకోవ్ అక్కడున్నాడు, మిషా సెవస్యనోవ్ అక్కడున్నాడు, లెవా గ్రిగొరేవ్ అక్కడున్నాడు. నాతోడి వారూ, నేనూ రెండో తరగతీ, ఆ తరవాత మొదటి తరగతీ పరీక్షలు పాసయి, యింకా ఎక్కువ వేగంగల విమానాల్ని నడపాలని కలలుగన్నాం. కాని ఎక్కువ వేగాల్తో ఎగరడం అంతమందిమీ సాధించలేక పోయాం.

ల్యోషా కోవల్ అన్న సైబీరియన్ కుర్రవాడు, నాకు మంచి స్నేహితుడు. అతనొక రోజు మామూలుగా జరిగే యానానికెళ్ళి తిరిగి రాలేదు. ఎగురుతూ వున్నప్పుడు అతని మోటారు పని చెయ్యకండా ఆగిపోయింది. అలెక్సీ బలవంతాన దిగవలసి వచ్చింది. ఆ విధంగా అతను కనిపించాడు —చేతుల్లో చక్రాన్ని గట్టిగా పట్టుకొని.

యూరీ గతియతోవ్ పెద్ద బరువులతో విమానాలు నడపలేక పోయాడు. పైటర్ విమానాలంటే బాగా అభిమానం ఏర్పడ్డాక అతను రవాణా విమానాలకు వెళ్ళిపోవలసి వచ్చింది. మేము వీడ్కోలిచ్చేటప్పుడు, అతను నాకు తన పద్యాలివ్వడం జ్ఞాపకం వుంది.

చెప్పింది ఏదీలేదు, అడిగింది ఏదీలేదు,
నేనుమాత్రం చాటుగా నిట్టూర్చి, గమ్మున ఊరుకుంటాను మళ్లీ.
వెచ్చని దారుల్లో చల్లని మంచు,
పూపు పట్టిన బెర్రీ పళ్ళ కాపు, రాలి పడిపోయింది రాత్రి....
నా గుండెల్లో కలగుండు, మళ్ళీ చిరకాలం ఎడబాటు.
నేను నాటెను బిర్చి మొక్కను—మీరు కాపాడాలి దాన్ని,
అది ఏపుగా పెరగాలి, ఓల్గా ఒడ్డున జ్ఞాపక చిహ్నంగా,
మన అతిక్రమ్మని కలయికలకు.

అంతరిక్షం అంతరిక్షమే. అది సంతోషాన్ని తెస్తుంది, మనిషికి బలానిస్తుంది, పట్టుదలగా జాగ్రత్తగా వుండాలని బోధిస్తుంది. సంతోషంగా విమానయానం చేసే సమయం వుంటుంది. కాని మీతో జోడుగా, రెక్క-రెక్కా కలిపి మరెన్నడూ ఎగరబోని వారి దుర్గతికి సంబంధించిన విషాద స్మృతులూ వుంటాయి దాంట్లో.

అయితే జీవితం కూడా జీవితమే. అది కూడా వైపరీత్యాలతో నిండి వుంటుంది. ఒకరోజున అది నన్ను ఊహించని, సంతోషకరమైన ఆశ్చర్యంలో ముంచెత్తింది.

నేనెరిగిన బాలికలతో సంబంధాల విషయంలో, గౌరవ సభ్యతలకు వేరయినదెన్నడూ నాకు తెలియదు. బాల్యంలోనూ, పాఠశాలలో పై తరగతులలోనూ, విమాన పరిషత్తులోనూ నాకు పరిచయమైన బాలికలెంతో మంది ఉన్నారు, నాతోబాటు ఒకే అభిరుచులున్నవారు. కాని నాకు పెళ్ళి చేసుకుందామన్న ఉద్దేశం కలగలేదు. తగిన వరునిగా స్త్రీలు నన్ను చూడలేదు. ఇటువంటి "విభజన"కు పనికిరానివాడిగా నేను లెక్కలోకి వెళ్ళాను.

మా స్క్వాడ్రన్‌లోని మెకానిక్కు యువకులతో ఏవో సిద్ధాంత కృషి చేయాలని నాకు పని అప్పగించబడింది. నేను జాగ్రత్తగా సిద్ధపడిన యీ పని, ముఖ్య రంగాలలో మా జ్ఞానాన్ని పెంచుకోవడానికి నాకూ, నా స్నేహితులకూ తోడ్పడింది. నేను మొదట ఒకరితోనూ, తరవాత ఇంకొకరితోనూ వారివారి పుస్తకాలు పెట్టుకొని కూచునేవాణ్ణి. కాని "నా విద్యార్థులు" ఎప్పుడూ, పని అయిపోయేసరికి ఒక విధమైన విసుగుదలను చూపేవారు—క్లబ్బులో సాయంత్రం నృత్యాలుండేవి, ఏదో ఒక సాకుతో ఆ కుర్రవాళ్ళు అక్కడికి వెళ్ళడానికి ప్రయత్నించేవారు ప్రతిరోజూ.

నిజం చెప్పాలంటే, నాకు నాట్యాలు యిష్టం లేదు. ఎంచేతనంటే నేను బాగా నాట్యం చెయ్యలేను. కాని ఒకరోజున—ఆ రోజు సాయంత్రం నాకు ప్రత్యేకంగా మనోహరంగా వుంది—ఆపుకోలేక నేను కూడా క్లబ్బుకెళ్లాను. బహుశా నేను నాట్యం చేసి వుండేవాణ్ణి కాదు, ఒక వేపున ఆకర్షణ కలిగించే ఒక అమ్మాయి కనిపించకపోతే.

ఆ అమ్మాయి మామూలుగా ముస్తాబు చేసుకుంది, కేశాలంకరణ జాగ్రత్తగా, దృఢంగా చేసింది. నేను పిలిస్తే ఒక్క పిసరుకూడా కంగారు పడకుండా, ఆవిడ నాతో నెమ్మదిగా, ప్రశాంతంగా నాట్యం చేసింది. ఒక్క మాటలో చెప్పాలంటే, ఆవిడ నాకు నచ్చింది. ఎవరో పిలిస్తే నేను మధ్యలో వెళ్ళాను; అప్పుడా అమ్మాయి, ఆ అమ్మాయి స్నేహితులూ

హాలులోంచి వెళ్ళిపోవడం నేను గమనించలేదు.

మర్నాటి సాయంత్రం, ఆ మర్నాడూ, మూడోనాడూ, నేను వేళ తప్పకుండా వెళ్ళడం తోడివాళ్ళకు ఆశ్చర్యం కలిగేటట్టుగా, నేను క్లబ్బుకు మొట్టమొదటే వెళ్ళి, వాద్యకారులు తమ వాద్యాలను పెట్టెల్లో పెట్టేటప్పుడే దాన్ని వదిలిపెట్టేవాణ్ణి. నృత్యం చేసే వాళ్ళలో నేను, కొంత ఎత్తయిన దవడ ఎముకలూ, నల్లని కళ్ళూ గల అమ్మాయి ముఖం కోసమే—నాలో మమత పెంచిన ముఖం కోసమే వెతికేవాణ్ణి. ఆవిణ్ణి ఎక్కడో చూసినట్టుగా వుందని ఎప్పుడూ ఆలోచిస్తూ వుండేవాణ్ణి. ఎక్కడో ?

లెనిన్‌గ్రాడ్ ప్రాంతంలో తరచు జరిగేటట్టుగా, బూడిద రంగుగా, మందంగా వుండే రోజుల తరవాత, ప్రకాశవంతంగా ఎండతో వుండే రోజులు వచ్చాయి. తీవ్రమైన శిక్షణా యానాలు మొదలయ్యాయి. నేనంతా అంతరిక్ష యాత్రలమీదే కేంద్రీకరించాను. ఆ నల్ల కళ్ళ అమ్మాయిని మర్చిపోయాను. కాని సాయంత్రం క్లబ్బుకెళ్ళేటప్పుడు, నేను వెచి వుండేది ఆమెకోసమేనని నేనెరుగుదును. ఒక రోజున మామూలుగా ఎగిరి వచ్చేక, నా రోలు కట్టు తియ్యకుండానే, అవాపుడిగా కాస్తంత తిని, విమానంలో ఇంధనం పోసి, మళ్ళీ బయలుదేరవలసి వచ్చింది.

నేను విమానాశ్రంలోని హోటల్లోకి పరుగెత్తి, "రొండుసుగా ఏదేనా తెచ్చిపెట్టు" అని కేకేశాను.

హటాత్తుగా ఆ నల్లకళ్ళ అమ్మాయి నావేపు వస్తున్నది.

"ఆరి దేవుడా !" అని గొణిగి, "నిన్ను నేను చూసిందిక్కడేనా : ఈ వేళ క్లబ్బులో నీకోసం చూస్తుంటాను. ఎక్కడికీ పారిపోకు" అని అన్నాను.

"నేనెక్కడికీ పారిపోలేనే" అందా అమ్మాయి మామూలుగా.

మేము తొందర్లోనే పెళ్ళి చేసుకున్నాం. పెళ్ళి పెద్ద ఘనంగా ఏమీ జరగలేదు. నేను నాన్నగారికి ఒక ఉత్తరం వ్రాశాను. ఆయనకు తమారా గురించి తెలియజేశాను. ఆ అమ్మాయి గురించి నా ఉద్దేశాలు వ్రాశాను. కానయితే అప్పటికే జరిగిపోయిన దాన్ని గురించి ఏమీ చెప్పలేదు. నాలాంటి

అసమర్ధుడయిన లౌక్యుడికి నాన్నగారిని దగా చెయ్యడం తేలికేమీ కాదు. ఆయన నన్ను బాగా ఎరుగును. ఆయన జవాబు సూటిగా వుంది: "మీరు వెంటనే పెళ్ళి చేసుకోండి" అని. ఇది దీవనా, అభినందన కూడా.

కుటుంబ జీవితంలో రకరకాల సంగతులు జరుగుతాయనీ, భార్యాభర్తలకు అప్పుడప్పుడు భేదాభిప్రాయాలు కలుగుతాయనీ గ్రహించాను. మా కుటుంబ సమస్యలన్నిటికీ పరిష్కారాన్ని కనిపెట్టడానికి ప్రయత్నించాను. ఒకసారి తమారా యింట్లోని వస్తువుల్ని మార్చాలనీ, కొత్త కర్ర సామాన్లనూ, అలంకారాలనూ కొనాలనీ పట్టుపట్టడం నాకు జ్ఞాపకం. నేను జోక్యం కలిగించుకోనేలేదు. కాని మేము యింకో చోటికి వెళ్ళిపోవలసి వస్తే, ప్రతి ఒక్కటీ పాత యింట్లోనే వదిలిపెట్టవలసి వస్తుందని నేను హెచ్చరించాను. తమారా దీన్ని ఎదిరింపుగా తీసుకుంది. నేను ఉన్న పరిస్థితిని చెప్పానన్నాను.

ఆ రోజుల్లో మాకు తరచు ఒక స్థావరం నుంచి యింకో స్థావరానికి బదిలీ అయ్యేది. నా వాదం, నిజమే.

ఆవిడకు కవిత్వం అంటే యిష్టం. కాని నేను మ య కో వ స్కీ పద్యాల్ని గట్టిగా చదివితే, యింకో గదిలోకి వెళ్ళిపోయేది. నేను చదివే తీరో, లేకపోతే మయకోవస్కీ కవిత్వమో—ఆవిడకు ఏది యిష్టం లేదో నాకు తెలియదు. కాలం గడిచింది. ఇప్పుడు యిద్దరమూ కలిసి, ఆ కవి గ్రంథాన్ని చదివితే, మా ఆవిడ సంతోషంతో వింటుంది.

1960 జులైలో మాకో అబ్బాయి పుట్టాడు. పుట్టాక తొలి నెలల్లోనే వాడికి తీవ్రమైన గుండె జబ్బు వున్నట్టుగా డాక్టర్లు కనిపెట్టారు. ఒక పెద్ద ప్రవీణుడు మా ఆవిడను ఓదార్చి, నాతో స్పష్టంగా చెప్పారు.

"కుర్రవాడు ఎంతకాలం వుంటాడో చెప్పడం కష్టం—ఒక నెల, లేకపోతే మూడు నెల్లు" అంటూ ఆయన చెప్పి, "కాని బిడ్డ దక్కడు" అని చెప్పారు.

ఈ పరిస్థితిలో చలించకుండా వుండడానికి నేను సాధ్యమైనంతగా ప్రయత్నించాను. ఈ దెబ్బను తమారా తట్టుకోగలిగేటట్టు చేయడానికి ప్రయత్నం చేశాను. ఆవిడ అంతా అర్థం చేసుకున్నదనిపించింది నాకు. కాని

బిడ్డ చనిపోయినప్పుడు చాలా దుఃఖించింది. ఆ కష్ట దినాలలో ఆమె నాకు మరీ ప్రేమాస్పదురాలయ్యింది. ఆమెను ఒంటరిగా వుండనియ్యకుండా, యీ దుఃఖాన్నీ నష్టాన్నీ ఆమె తట్టుకునేటట్టు చేయడానికి నేను ప్రయత్నించాను. నేను విమానాలమీద లేని కాలం అంతా మేము కలసి వుండేవాళ్ళం; కళా ప్రదర్శనలకూ, నాటకాలకూ వెళ్ళే వాళ్ళం. కొన్నికొన్ని సార్లు రాత్రి చాలా పొద్దుపోయేవరకూ కూచొని, మేము చూసినవాటి గురించీ, చదివినవాటి గురించీ మాటాడుకునే వాళ్ళం. కాలమే అన్నిటినీ సర్దుబాటు చేస్తుంది, యీ దురదృష్టపు తీవ్రత రానురానూ సన్నగిల్లింది. కాని ఆ బాధ మాత్రం మా జీవితాంతం వరకూ వుంటుంది.

బాల్యం నుంచీ నాకు సినీమాలు చాలా యిష్టం. అయితే ప్రాయం హెచ్చుతూన్నకొద్దీ నా ఉత్సాహం కొంత చల్లబడింది—ముఖ్యంగా వీరుల దుస్సాహసాల గురించీ, లేకపోతే వారి ఊహాజనితమైన ప్రతాపాల గురించీ, నాయకీమణుల కల్పిత సౌందర్యం గురించీ, ప్రేమ కథల్లో విషాదాంతాలో, సుఖాంతాలో అయిన ఘట్టాల గురించీ (యివి ఎప్పుడూ ముందరే తెలిసి పోతాయి). ఫిల్ములోని అబద్ధమన్నా, కృత్రిమత్వమన్నా నాకు గిట్టకుండా పోయింది. అంచేతనేమో, చారిత్రక చిత్రాలూ; నిజాయితీ విషయమై, ధైర్యం విషయమైనా భావాలకు దగ్గరగా వుండే చిత్రాలూ నాకెప్పుడూ యిష్టం.

ఉదాహరణకు క్రూరత్వం అన్న ఫిల్ము నామీద మాయని ముద్రను వేసింది. ఇది ఆద్యంతమూ సత్యమైన చిత్రం. దాని పాత్రల ఆలోచనలూ, భావాలూ దానిలో కొల్లలు, అది సత్కార్య భరితమైనది. నేనది చూసినప్పుడు, ఆ నటులు నిజమైన వారేనని నేను నమ్మాను. ఆ కాలంలో, సోవియట్ రాజ్యం మొదలైన రోజుల్లో అటువంటివారు వుండేవారనీ, యిప్పుడు నాతో బాటు వుంటున్నారనీ భావించాను.

ఫిల్ముల విషయంలో లాగే నేను పుస్తకాల విషయమైకూడా అదే విధమైన అభిప్రాయాన్ని ఏర్పరచుకున్నాను. నాకు చారిత్రిక నవలలు యిష్టం, ప్రత్యేకంగా ఓల్గా ఫోర్ష్ నవలలు. ఆమె పుస్తకాల్లోని పాత్రలు,

ముఖ్యంగా విప్లవకారుల పాత్రలు నా భావాలతో వున్నట్టుగా, ఒక మాదిరిగా నాకు మారు రూపులుగా నచ్చాయి నాకు.

హాస్య కథల గురించీ, చమత్కార గాథలూ మొదలైనవాటి గురించీ నా అభిప్రాయమేమిటని తరచు అడుగుతుంటారు నన్ను. ఈ ప్రశ్నలడిగిన వారికి ఒకొక్కప్పుడు నేను కోపం కలిగిస్తుంటాను. సన్నివేశాలు అవాస్తవికంగానూ, పాఠకునికి నవ్వు కలిగించడానికి కల్పింపబడినవిగానూ వుంటే, యిటువంటి కథలు నేను చదవను. ఒక మంచి, చమత్కారమైన ఉదంతం, అన్నిటికంటే ఒక చిన్న ఉదంతం—సాహస కార్యాల గురించి ఆలోచన గాని, ఒక సన్నివేశం ఏర్పడుతుందేమోనన్న పరిశీలన గాని కల్పించక, కేవలం నవ్వించేదైతే మంచిది.

నాకు జాక్ లండన్ యిష్టం. ఆయన కథల్లోని సత్యం, జీవనం, గట్టి పాత్రలూ, ధైర్యమైన దాని వీరుల చర్యలూ నాకు యిష్టం. డ్రైసర్ పుస్తకాలన్నీ నేను చదివాను. ప్రతిభా శక్తులు గల ఆ జీవిత పాఠశాలా విద్యార్థికి, తానైతే ఎవరి గురించి వ్రాస్తున్నాడో ఆ ప్రజల గురించి తెలుసును, తానెవరి కొరకైతే వ్రాస్తున్నాడో వారినీ ఎరుగును. ఆయన వ్రాసిన అమెరికన్ విషాద కథ, గంభీరమైన పెట్టుబడిదారు, ఘనుడు, తాత్త్వికుడు, ప్రతిభావంతమైన ఉపజ్ఞాశాలి మానవ నాటకంలోని ఘట్టాల్లా వున్నాయి. డ్రైసర్ అంటే నాకు యిష్టం కలగడానికి యింకో కారణమేమిటంటే, యిటీవల ఆయన రచనల సంపుటాన్ని తిరగవేస్తుండగా, మహత్తర అక్టోబరు సోషలిస్టు విప్లవం 25వ వార్షికోత్సవం గురించి 1942 లో ఆయన వ్రాసిన మాటలు నాకు సంతోషాన్ని కలిగించడం. అవేమిటంటే—

"చరిత్ర చాలా దేశాలను చూసింది" అని డ్రైసర్ రాశారు. "ఆ దేశాలు లేచాయి, పడిపోయాయి. కాని సోవియట్ దేశంలో లాగా యింకే దేశంలోనూ యిటువంటి అద్భుతమైన పథకాలూ లేవు, యిటువంటి ఘన విజయాల్ని సాధించడమూ లేదు. మానవతతో ప్రపంచ సమాజాన్ని నెలకొల్పడానికి కృషి చేస్తూ, అందుకోసం చావడానికి సిద్ధంగా వున్న దేశాన్ని,

చివరికి నా జీవితకాలంలో చూశాను"*. తన ప్రజల గురించి యిటువంటిది చదవడం సంతోషంగా వుంటుంది—ముఖ్యంగా తాను ఎంతో గౌరవించే రచయిత యిటువంటిది వ్రాయడం.

వైజ్ఞానిక కల్పనా సారస్వతంలో, రచయిత దేని పైనైతే తన దిగ్భ్రమ కలిగించే విషయాలను నిర్మిస్తాడో ఆ నిజమైన ప్రాతిపదికను కనుక్కోవడానికి నేనెప్పుడూ ప్రయత్నించేవాణ్ని. ఊహా విహారం ఎంత జోరుగా సాగినా, నవలలోనిదంతా నాకిష్టంగా వుండేది,—ప్రేమ కథలు సైతం—ఆ పుస్తకానికి వైజ్ఞానిక ప్రాతిపదిక వున్నదని నాకనిపిస్తే.

నాకు అభిమాన పాత్రమైన కొన్ని పుస్తకాలనూ, కొద్దిమంది గ్రంథ కర్తలనూ పేర్కొన్నాను. వాటిని చదవకండా, ప్రపంచం పట్ల సద్భావంతో మనిషి ఎలా విద్యావంసుడవుతాడో; సౌందర్యాన్నీ, జీవితాన్నీ ఎలా ప్రేమిస్తాడో నేను అర్థంచేసుకోలేను. ఈ జాబితాలో మా రష్యన్ ఉద్గ్రంథాలన్నీ వున్నాయి.

నేను ఎప్పుడూ నా ఆలోచనలన్నీ తమారాకు చెప్పేవాణ్ని. ఆమె క్రమక్రమంగా నా లోపలి జీవితాన్ని తెలుసుకుంది. నాకున్నటువంటి ఆశయాలే పెట్టుకుంది—అంతరిక్షం పట్ల, మంచి పుస్తకాల పట్ల, కవిత్వం పట్ల, నిజమైన ఫిల్ములపట్ల, ఒక్క మాటలో చెప్పాలంటే మేము మంచిదనుకున్న ప్రతి ఒక్క విషయం పట్లా అభిమానం.

* రష్యన్ నుండి మళ్ళీ అనువదింపబడింది—సం.

# "ఉండండి, తరవాత విమ్మల్ని పిలుస్తాం"

ప్రజలూ, అలజడిని రేకెత్తించే సంగతుల్ని వ్రాసే పశ్చిమ దేశాల పత్రిక రచయితలూ తరచు, రోదసీయానం చేసే మాకు మానవాతీతులన్న గొప్ప బిరుదు నిస్తుంటారు. అప్పుడప్పుడిది నాకు నవ్వు పుట్టిస్తుంది, కోపం కలిగిస్తుంది, రోదసిలోనికి మానవుని మొదటి యాత్రను గురించీ, తరవాత రెండవ యాత్రను గురించీ విన్నప్పుడు కలిగే ఆశ్చర్యాన్ని నేను అర్థం చేసుకోగలిగినప్పటికీ. ఇది ఆశ్చర్యకరమైన, బ్రహ్మాండమైన విజయం హేతు బుద్ధికి. ప్రజల మనస్సు లెలావున్నా, నడత లెలావున్నా సోవియట్ రోదసీ నౌకాయానాలను వారు పట్టించుకోకుండా వుండలేరు.

విశ్వంలోనికి మానవుని తొలి అడుగులు, భూమ్యాకర్షణ యొక్క బ్రహ్మాండమైన శక్తితో తొలి పోరాటం, రోదసి దూరాలు, కాలం చిక్కు సమస్యలతో స్పుత్నిక్కుల ట్రాజెక్టరీలను లెక్కగట్ట గలిగిన ప్రథమ మానవ మేధా విజయాలూ, లైకా అన్న కుక్కగల కోశమూ, చంద్రమండలానికి పంపబడిన రాకెట్లూ, శుక్ర గ్రహం వేపుకు పంపబడిన స్థావరమూ, చివరికి వోస్తోక్ (ప్రాచ్యం) అన్న సంకేత నామంగల నౌక—వీటిని అతి కల్పితమైన ఊహా విహారంతోనూ, మాయా మంత్రజాలాలతోనూ పోల్చని వారెవరు ?

ఏమైనప్పటికీ, రోదసీ నౌకా చోదకులం ఎవరిమైనా కావొచ్చును గాని మానవాతీతులం మాత్రం కాము. దీన్ని నాటుక పోయేటట్టుగా చెప్పడానికి నేనూ, నా స్నేహితులూ ఎలా రోదసీ నౌకాచోదకుల మయ్యామో చెప్తాను.

అది 1959 చివర జరిగింది. మామూలులాగనే ఆ రోజూ మేము ఎగరడానికి సిద్ధంగా ఉన్నాం. గాలి మారింది, బలంగా గాలి వీస్తోంది,

పొడి మంచులో కలిసి గాలి మాటిమాటికీ వస్తోంది. విమానాలలో వెళ్ళడం ఆగిపోయింది. నేను హాటలుకు వెళ్ళడానికి సిద్ధపడ్డాను. అప్పుడు ఎవరో "తితోవ్!" అని పిల్చారు. నేను తిరిగి చూశాను. మా దళం కమాండరు.

"సెలవిప్పించండి."

"మా ఆఫీసుకు రండి. వాళ్ళు మీకోసం చూస్తున్నారు."

ఆజ్ఞలంటే ఆజ్ఞలే. నా కోసం ఎవరు చూస్తున్నారో అన్న విషయాన్ని ఎక్కువ ఆలోచించకుండానే, నేను కేంద్ర కార్యాలయానికి వెళ్లాను. పరిచయమైన చోట తలుపు కొట్టాను. టేబుల్ లాంపులోంచి వస్తోన్న వెచ్చని కాంతిలో మెడికల్ కల్నల్ చిహ్నాలు భుజాలకు తగుల్చుకునివున్న ఒక అధికారిని నేను చూశాను. "ఏమిటిది? డాక్టరెందుకు?" అని అనుకున్నాను నాలో నేను.

డాక్టర్లంటే నాకూ భయమే, చాలామంది వైమానికుల్లాగానే. మన ఆరోగ్యాన్ని చూసే డాక్టర్లు, ఎవరినైనా విమానంలో వెళ్ళకుండా చేయడానికి ఏదో ఒక దానికోసం వెదుకుతుంటారు ఎప్పుడూ. అప్పటివరకూ నా విషయంలో అంతా సవ్యంగానే వుంది. చిన్నప్పుడు విరిగిన చెయ్యిగురించి కూడా నేను రహస్యంగా వుంచగలిగేను. హఠాత్తుగా యీ డాక్టరేమిటి, కమాండర్ ఆఫీసులో.

కల్నల్ నన్ను కూచోమన్నారు. నా రికార్డులోనుంచి తీసుకున్న వైద్య వివరాల్ని ఆయన మళ్ళీ చూసి, హఠాత్తుగా "ఒక కొత్త సాంకేతిక పద్ధతితో ఎగరడం మీకిష్టమేనా?" అని నన్ను అడిగారు.

"ఏమిటీ!"అని తన అనధికార భాషలో నేను కేకేశాను. "ఏ వైమానికుడు వెళ్ళడు?"

మమ్మల్ని సూపర్‌సానిక్ విమానాల్లో పంపుతారని దళంలో వదంతులున్నాయి.

"రాకెట్లలో అయినానా?" అంటూ ఆ డాక్టరు అడిగారు, నావేపు తేరిపార చూస్తూ. నేను జబాబు చెప్పడానికి ముందరే "భూ ఉపగ్రహాలలోనైనా?" అని ఆయన ప్రశ్నించారు.

ఇప్పుడు మాత్రమే నేను, యిది జరిగిన ఎన్నాళ్ళకో, అప్పుడు నా మనసులో చెలరేగిన భావాలన్నిటి గురించీ ఆలోచించగలను ? రోదసా ? స్పూత్నిక్కులా ? అవును, అప్పటికప్పుడే అక్కడికి యాత్రలు చాలా జరిగాయి. మనిషి అక్కడికి వెళ్ళవలసిన సమయం, శీఘ్రంగా వెళ్ళవలసిన సమయం వచ్చిందని సామాన్య వైమానికుణ్ణయిన నాకు ఎప్పుడూ తట్టనే తట్టలేదు.

"స్పూత్నిక్కులలోనా ? ఏమిటీ !"

"సరే, బాగుంది. ఉండండి, తరవాత మిమ్మల్ని పిలుస్తాం"అన్నారు డాక్టరు.

గంతేస్తూ నేను యింటికెళ్లాను, మంచు కప్పివున్న బాటనైనా చూడకుండా. గాలి ముఖంమీద కొడుతోంది. నా శిరస్త్రాణానికున్న పీలికలు నా చెక్కిళ్ళకు కొట్టుకుంటూ వున్నాయి, నా ఫర్ జుబ్బా పూర్తిగా తడిసి పోయింది, కాని నేను వెచ్చగా వున్నాను.

"అయ్యో దేవుడా !"అనుకున్నాను. "స్పూత్నిక్కులలో ఎగరడమా! విమానయాన సాంకేతిక విద్య నాకు తెలుసు. ఇప్పటి వరకూ అదంతా చాలా దూరంగా వున్న విషయమని అనిపించేది. నా బిడ్డలే కాదు, నా బిడ్డల బిడ్డలూ నేలకే అంటిపెట్టుక వుంటారనుకున్నాను. హటాత్తుగా "స్పూత్నిక్ మీద వెళ్ళాలనుందా ?" అని అడిగారు. "తప్పకుండా వెళ్తాను !"

తమారా నేను తరవాత వస్తాననుకుంది, విమానంలో వెళ్ళాక. అంచేత కంగారు పడింది. "ఏం జరిగింది, గెరా ? ఏమైనా ముప్పు వచ్చిందా ?"

"ముప్పంటావా ? అందుకు విరుద్ధం !"

"మనం యిక్కణ్నుంచి వెళ్ళిపోతున్నామా ? ఇంకో దళానికి ?"

"ఆహా, యింకో..."

నేను చాలా ఆరాటంలో వున్నాను. నేను పరాచికాలాడేను, అవి అంతగా మంచివి కావేమో, తెలివితక్కువ మాటలాడేను. కాని తమారా అంత సులువుగా వదిలిపెట్టే మనిషి కాదు. "చెప్పు, ఏమయ్యింది, ఏమి



నక్షత్రాలవద్దకు వెళ్ళడానికి తన వంతు వచ్చింది.

జరిగింది ?" అంటూ పట్టుపట్టింది.

కాని సేనాపిడకు ఏమి చెప్పేది ? నాకే సరిగ్గా తెలియని సంగతిని ఎలా చెప్పేది ?

పచ్చి అబద్ధాలని వున్నాయి కదా, నేనవి చెప్పాను. "నన్ను టెస్ట్

పైలెట్‌గా తీసుకునేటట్టున్నారు. అంతే."

"మరి మాసంగతేమిటి?"

"మా" అన్నమాట, ఆమె కడుపులో వున్న బిడ్డకు సంబంధించినది.

"అంతా సవ్యంగానే వుంటుంది. బెంగపెట్టుకోకు. నన్ను పిలుస్తారో లేదో నాకు తెలియదింకా."

తరవాత అనుకున్నాను, వాళ్ళు నన్ను నిజంగా పిలవకపోవచ్చని— ఏం జరుగుతుందో ఎవరికి తెలుసు—నేను స్వంత డబ్బా వాయించుకునే వాడిలా అయిపోతాను. ఆ రాత్రి నేను నిద్రపోలేదు. "వాళ్ళు నన్ను పిలుస్తారా, పిలవరా? వాళ్ళు నన్ను పిలుస్తారా, పిలవరా?"

రోజులు పొడుగ్గా, విసుగ్గా పెరిగిపోతున్నాయి. మా యానాలు మామూలుగా వెళ్తున్నాయి. మా ఇంటర్‌సెప్టర్ టెక్నిక్‌ను మేము పెంపొందించుకోవాలి, మెకానిక్కులతో విద్యా వ్యాసంగాన్ని సాగించాలి, ఎన్నెన్నో సైనిక విషయాలను నమోదు చేయాలి, తమారా గురించీ, పుట్టబోయే బిడ్డ గురించీ ఆలోచించుకోవాలి. కాని నా మనస్సులో ఎప్పుడూ అదే ప్రశ్న "వాళ్ళు నన్ను పిలుస్తారా, పిలవరా?" అన్నది మెదులుతూ వుండేది.

ఆ రోజుల్లో నేను తరచు తమారాతో స్పూత్నిక్కుల గురించి మాటాడుతూ వుండేవాణ్ని, మనిషి రోదసిలో ఎగిరే కాలం ఎంతో దూరాన లేదని చెపుతూ వుండేవాణ్ని. ఒక రోజైతే నేను చటుక్కున "నేను అక్కడికే వెళ్ళబోతున్నాను" అని అనేశాను.

"ఏమిటంటున్నారు!" అని అంది తమారా ఆశ్చర్యంతో. "మీరు దళంలోని మంచివాళ్ళలో ఒకరని వాళ్ళనుకుంటున్నారా? తొందర్లో మీరు పరిక్షలకు కూచోబోతున్నారు, హటాత్తుగా మధ్యలో అన్నీ వదలిపెట్టేస్తున్నారు."

"అవును, నువ్వన్నది నిజమే"నని నేను ఒప్పుకున్నాను. "టెస్ట్ పైలెట్లుగా కూడా అందరికంటే అడుగునున్నవారిని తీసుకోరే" అని అన్నాను.

రోదసి గురించీ, దానికి సంబంధించిన వాటి గురించీ బాగా తెలుసు

కునేందుకు నేను త్సియొల్కోవ్‌స్కీ, త్సందర్ రచనలు చదివాను. ఖగోళ శాస్త్రం గురించీ కుప్పలు కుప్పలుగా పుస్తకాలు చదివేను. చంద్రమండలానికీ, శుక్ర గ్రహానికీ, ఉన్న గ్రహాలకూ, లేని గ్రహాలకూ యాత్రల విషయమై రకరకాల వైజ్ఞానిక కల్పనా సారస్వతాన్నీ చదివాను. నా కలల్లో నేను కూడా ఎక్కడో విశ్వంలో వుండేవాణ్ణి, కాని పిలుపు రాలేదు. ఏదో సంధిలో దీనంతటి గురించీ నేను ఆలోచించాననీ, కల్నల్ డాక్టరు ఎవ్వరూ లేరనీ, నేను నిజంగా ఆయనతో మాటాడలేదనీ అనిపించేది. దీన్ని గురించి నేను ఎవరితోనూ సంప్రదించ లేను, నా బాధను ఎవరికీ చెప్పుకోనూ లేను. కల్నల్ డాక్టరు, మా సంభాషణను జనానికి చెప్పవద్దని హెచ్చరించారు. ఆయన రాకుండావుంటే బాగుండేది, ఆ డాక్టరు.

సెలవల రోజులు వచ్చాయి, మేము ఆల్తాయ్‌కి వెళ్ళాం.

నేను యింటికి వెళ్ళి: మా నాన్నగారినీ, అమ్మనూ, చెల్లెలు జెంఫిరానూ చూసీ చాలాకాలమయ్యింది. కాని యీసారిలాగా నేను ఎన్నడూ యింత త్వరగా మా దళానికి వచ్చాననుకోను. నేను మా దళానికి వచ్చేసరికి, వెంటనే నాకు కేంద్ర కార్యాలయం నుండి పిలుపు వచ్చింది.

"కబురు వచ్చిందా ?"

"వచ్చింది, కాని మీరిక్కడ లేరు. మేము కాగితాన్ని డివిజనుకు పంపించాము."

డివిజన్ డాక్టర్లను నేను ఎన్నిసార్లు వేధించానో వారి ఆఫీసుల గుమ్మాలు ఎన్నిసార్లు దాటానో తెలియదు. చివరికి కాగితం దొరికింది. డిసెంబరు నెలలో మాస్కోకు వెళ్లాను.

వైద్యసంస్థ అడ్రెసు ఆ కాగితం మీద వుంది. చాలా తొందరగానే నేను యీ పాతరకపు ఒకరికి చెందిన యిల్లు కనిపెట్టాను. ఇక్కడ యీ కొత్త, రహస్య (నాకు) సంస్థ వుంది.

ప్రధాన వైద్యుని కోసం కాచుకునివుండే గదిలో వైమానికుల గుంపొకటి వుంది. అంతా సుమారు నా వయస్సు వారే. వాళ్ళు వివిధ దళాల నుండీ, ప్రాంతాలనుండీ వచ్చిన వాళ్ళు. ఇందుకు తగ్గ వాళ్లెవరో ఒక



సెంట్రీఫ్యూజ్ పరిభ్రమణాలు హెచ్చాయి.
ఒత్తిడి ఎక్కువ అవుతుంది.

నిమిషంలో చెప్పవచ్చు. ఉదాహరణకు ఒకతను, అసహజమైన వైముఖ్యంతో డాక్టర్లను దూషిస్తున్నాడు: "ఓ, వాళ్లు తగలడనీ! ఏదో రాకెట్టు

మీద వెళ్ళాలన్న పిచ్చేమీ నాకు లేదు!"

సహజంగా, అతను ఎంచుకోబడలేదు.

ఇతరులు భయభయంగా తలుపువేపు చూస్తున్నారు; దాని వెనుకను తమకు ఒక కొత్త ప్రపంచం, అపరిచిత జీవితం మొదలు అవనూ వచ్చు, అవకపోనూ వచ్చు. విఫలుడయిన ఒకతను ఒక పేరు కొన్నిసార్లన్నాడు —ఎవ్‌గెనీ అలెక్సీవిచ్. ఆయనే ప్రధాన వైద్యుడని నేను గ్రహించాను.

మొదటి రోజు నావంతు రాలేదు, రెండో రోజూ రాలేదు. మూడో రోజు నేను వచ్చేసరికి వెయిటింగ్ రూములో యింకెవరూ లేరు. నేను ధైర్యం తెచ్చుకుని, కార్యాలయంలోకి ప్రవేశించాను, పిలవకండానే.

"మీరు ఎవరిని చూడాలి?" అని నన్ను కటువుగా అడిగారు ఆ వైద్య కల్నల్.

"మిమ్మల్ని."

"ఎందు గురించి?"

"రోదసి వ్యవహారం గురించి" అన్నాను, కాగితం అందిస్తూ.

ఆయన చిరునవ్వుతూ అంతా చదివారు.

"ఇక్కడికి రావడానికి మీరు ఆలస్యం చేశారు. నిశ్చయానికి రావడానికి యింతకాలం పట్టిందా?"

"ఇంచుమించు దీనికి భిన్నం, కామ్రేడ్ కల్నల్. నేను వెంటనే ఒక నిర్ణయానికి వచ్చాను. కాని మీరు రమ్మని పంపిన కాగితం కోసం మూడు వారాలు ఎన్నో కార్యాలయాల్లో వెతికాను. ఇప్పుడు వచ్చాను."

"మంచిది, చూద్దాం. ఈ ఆజ్ఞ పట్టుకుని ఆసుపత్రికి వెళ్ళండి."

"ఆసుపత్రికెందుకు?" అన్నాను నేను. "నాకు ఆరోగ్యం బాగుందే."

"అందుకే మిమ్మల్ని పిల్చింది."

వైద్య సంఘం మామూలు దళ సంఘం లాంటిదే అనుకున్నాను. డాక్టర్లు గుండె మీద కొడతారు, దాన్ని వింటారు, కీళ్ళు చూస్తారు, ఊపిరితిత్తుల ఘన పరిమాణాన్ని కొలవడం కోసం ఒక పరికరంలోనికి కొన్ని

సార్లు ఊపిరి తియ్యమంటారు, టేబుల్స్‌లోని అంకెల్ని చదవమంటారు, చిన్న అచ్చులో వున్న కొన్ని క్లిష్టమైన మాటలను చదవమంటారు, తరవాత చార్టుమీద మరి మార్చడానికి వీలులేని ఆమోదాన్నో, తిరస్కారణనో వ్రాస్తారు. ఇదే వాళ్ళు చేసే పని. ఈసారి ప్రతి ఒక్కటీ యింకా చిక్కుగా వుంది.

వాళ్ళు నన్ను ఆసుపత్రిలో పెట్టారు. నాచేత పాయ్‌జమా వేయించి, మెత్తని చెప్పులు యిచ్చారు. పక్కమీద పడుకోమన్నారు. చక్కని నర్సులు నన్ను "రోగి" అన్నారు. ఇది నన్ను మరీ బాధించింది. వైద్యుల దగ్గరికి నేను ఎన్నోసార్లు వెళ్ళాను. వాళ్ళు నన్ను పరిక్ష చేశారు. నా హృదయ స్పందనం విన్నారు, నా కనురెప్పల కింద ఏదో వేసి, ఉడికించిన చేపలాగా నా కనుగుడ్లను ఎక్కువ ఉబ్బేటట్టు చేశారు. నేత్ర వైద్యులు, లోపలి ఒత్తిడిని కొలవడానికి నా కళ్ళగుడ్లమీద పల్చని పలాస్త్రీ పూశారు.

నేను తొందర్లో కొందరితో స్నేహం చేశాను. కానైతే కాస్తంత విసుగెత్తింది నాకు. తమారా లెనిన్‌గ్రాడ్‌కు వెళ్ళింది, నేను ఆవిడకు ఉత్తరాలు రాయడానికి వల్లకాదు; ఎంచేతనంటే నేను ఆసుపత్రిలో వున్నాను అక్కడికి వెళ్ళడానికి తయారవుతూ. తక్కిన వాళ్ళను చూడడం మొదలుపెట్టాను. కొంత మంది, ఎక్కువమందే సంచులు సర్దుకుని తమతమ దశాలకు వెళ్ళిపోయారు. పరిక్షా వేదికలమీదా, సాధనాలవద్దా తమ వైఫల్యాన్ని కప్పిపుచ్చుకుంటూ, ఏదో తమకు పట్టనట్టుగా వాళ్ళు సెలవు పుచ్చుకున్నారు, రాకెట్లంటే తమకు ఆసక్తి లేనట్టూ, యిదేదో ఊహా విహారం అన్నట్టూ నటిస్తూ.

"వదిలిపెట్టెయ్యండి !" అన్నాడు విఫలుడైన ఒకతను. "సెంట్రీఫ్యూజ్‌లో ఐదు నిమిషాలుంటేచాలు, మీ గుడ్లెక్కోస్తాయి, యిక రాకెట్‌లో ఎలా వుంటుందో ఆలోచించుకోండి !"

రాకెట్‌లో ఎలా వుంటుందో మాలో ఎవ్వరికీ తెలియదు. కాని సెంట్రీఫ్యూజ్‌లో మాత్రం బాగుండదు. పెద్ద దూలానికి కట్టివున్న కుర్చీలో



రోదసీ నౌకా చోదకునికి దుస్తులు వెయ్యడం,
చాలా చిక్కయిన పని.

వాళ్ళు కూచోబెడతారు, రకరకాల గణక యంత్రాల్నీ, పరికరాల్నీ బరువుగా వేసి మిమ్మల్ని తిప్పడం మొదలు పెడతారు. కొద్ది సెకండ్లలో ఘోరమైన భారం ఎలా తొక్కేస్తోందో మీకు తెలుస్తుంది. గుండెలమీద ఏనుగ ఒకటి కూచొని కిందికి నొక్కేస్తున్నట్టుగా, తన ఏనుగ బలం అంతటితో నొక్కేస్తున్నట్టుగా వుంటుంది. మీ కనురెప్పలు సీసం బరువుతో కిందికి లాగుతుంటాయి, వేళ్ళకు ఒక హండ్రడ్ వైట్ బరువెక్కుతుంది, ఉచ్ఛ్వాస నిశ్వాసాలకే బ్రహ్మాండమైన ప్రయత్నం చెయ్యవలసి వుంటుంది. ఇంకో వేపున డాక్టర్లు రేడియో టెలిఫోను మీద మీకెలావుందో, మీరేం చూస్తున్నారో, మీరేమిటి ఆలోచిస్తున్నారో సులభమైన మాటల్లో చెప్పమంటుంటారు. పైకప్పు మీ చుట్టూరా గిరగిరా తిరుగుతోంటే, సెంట్రిఫ్యూజ్ జోరు హెచ్చిపోతోంటే, బరువులు భరించశక్యం కాకుండా వుంటే అక్కడ మీరు ఆలోచించేదేమిటి ?

ఈ ప్రకారంగా ఒక నెల రోజులు గడిచిపోయాయి. రోదసీ నౌకా చోదక అభ్యర్థుల జాబితాలో నా పేరు యింకా నాకు కనిపిస్తూనే వుంది. ఈ జాబితా రోజురోజుకూ నిర్దాక్షిణ్యంగా కుదించబడిపోతూ వుంది. నా ఆరోగ్య విషయమై డాక్టర్లకు యింకా ఏ లోపమూ కనిపించలేదనడానికి యిది ప్రబలమైన సూచన. త్వరలోనే వారి కార్యక్రమాలూ, పరీక్షలూ అయిపోయాయి. కాని యింకా నన్ను "రోగి" అన్న వింత పేరుతోనే పిలుస్తున్నారు. పనీ పాటా లేకుండా అక్కడే వున్నాను, ఒక రోజూ, రెండు రోజులూ, మూడు రోజులూ. చివరికి భరించలేకపోయాను. ఎవ్‌గెనీ అలెక్సీవిచ్ గారి దగ్గరకెళ్ళాను.

"మీరెందుకిలా పొడిగిస్తున్నారు?"

"మిత్రమా, వైద్య సంఘం పనంటే చిక్కు వ్యవహారం."

"నేను యింటికెళ్ళాలి. నేను ఆరోగ్యంగా వుంటే తీసుకోండి— లేకపోతే..."

ఎవ్‌గెనీ అలెక్సీవిచ్ చాలా సేపు వాదించారు, కాని చివరికి ఒప్పుకున్నారు,

మేము కార్యాలయం నుండి బయటికి వచ్చినప్పుడు, నాకు ఒలెగ్ చిజా కనిపించాడు విచారంగా. అతను మా దళంలో వుండేవాడు. ఒకే స్క్వాడ్రన్‌లో మేము కలసి ఎగిరి వెళ్ళేవాళ్ళం, కలసే యీ సంఘ పరీక్షలకు వెళ్ళాం. కాని వాళ్ళు, అతనికి ఐదేళ్ళ వయసులో ప్లూరసీ వచ్చినందువల్ల, చివరి దశలో అతన్ని ఎంచలేదు. అతను ఆరోగ్యవంతుడైన యువకుడు, ఘనమైన గుణాలు తెచ్చుకున్నాడు, ధైర్యశాలి అయిన వైమానికుడు, అయినా ఏవో "మిగిలి వున్న మచ్చలు" అతనికి అడ్డు పడ్డాయి.

"నేను కోల్కా షిరేవ్‌తో వెళ్ళిపోతున్నాను. సెంట్రీఫ్యూజ్ మీద అతను వాళ్ళకు పట్టుబడ్డాడు."

నేను తమారాకు ఏమీ చెప్పలేదు, మేము కలుసుకున్నప్పుడు. నేను దీన్లోనుంచి బయట పడడానికి ఏదో ఒక సాకును కనుక్కోవడానికి ఆవిడ ప్రయత్నించినా, యిప్పటికే మించిపోయింది. నేనేదేనా నిష్ఠ యించుకుంటే

యిప్పటిదాకా నేను ఎన్నడూ వెనక్కి మళ్ళలేదు; తప్పనిసరిగా లక్ష్యాన్ని చేరుకుంటున్నాను.

దీనికి ముందర తమారా, నేనూ అనేకసార్లు వైమానిక వృత్తి గురించీ; నేల మీదా, ఆకాశం మీదా విమానాలకు వచ్చే ప్రమాదాల గురించీ మాటాడుకున్నాం. ఎందుచేతనంటే—మా దళం కంటోన్మెంటులో కొంతమంది స్త్రీలు వుంటున్నారు; వైమానికులు వీరిని ప్రత్యేకమైన ఆదరాభిమానాలతో చూస్తుంటారు. వారి భర్తలు విమానాశ్రయానికి మళ్ళీ తిరిగి రాలేదు. విమానయానంలో రకరకాల విషయాలు సంభవిస్తూ వుంటాయి. తెలియనిది ప్రతి ఒక్కటీ, లేదా కొత్తది ప్రతిఒక్కటీ తమారాను భయపెడుతూ వుంటుంది. మాస్కోకు నేను వెళ్ళడం తప్పిపోవడానికి వుండే అవకాశాల గురించి ఆవిడ పదేపదే మాటాడేది. దీనిక్కారణ మేమిటంటే—దీనికి పూర్తిగా భిన్న విషయమైన, నేను టెస్టు వైమానికుణ్ని కాకూడదన్న విషయాన్ని ఆ విడ ఆలోచిస్తూ వుండడం. అక్కడ వున్నట్టయితే...

నా భార్యను ఒక కొత్తదారికి తీసుక రావడానికి—యీ కష్టమైన పనికి పూనుకున్నాను. నాకు అప్పటికే కంఠస్తమైపోయిన పుస్తకాల్ని ఆమెకు కంట పడేటట్టుగా పెట్టాను. అంద్రోమెడాలో నెబ్యూలా అన్న త్సియొల్కోవ్‌స్కీ పుస్తకాన్ని మేము మళ్ళీ చదివాము. విశ్వంలో ఏవి వుంటాయని మనిషి భావించుకోవచ్చునో వాటి గురించీ, మనిషికి గల మార్గాల గురించీ, మొదటి "విశ్వ యాత్రికు"లలో ఒకరు కావడం ఎంతటి మహత్తర భాగ్యమో దాన్నిగురించీ నేను ఆవిడతో చెప్పేవాణ్ని. తమారా నేను చెప్పేది వినేది, ఒకొక్కప్పుడు అంగీకరించేది, కాని తరచు ఆమె కళ్ళలో అపనమ్మకమూ, ఆందోళనా కనిపించేవి నాకు. ఆ లక్ష్యానికి చంద్రమండలానికి వున్నంత దూరం వున్నప్పటికీ, నేనిది సాగిస్తూనేవుండేవాణ్ని.

# విశ్వంలో ఒంటరిగా

వైద్య సంబంధమైన యీ కఠిన పరీక్షలలో ఎంతమంది అభ్యర్థులు నెగ్గారో నాకు తెలియదు—వందమందో, రెండు వందల మందో, వెయ్యి మందో. కాని మా భావి రోదసీ నౌకా చోదకుల దళంలోనికి తీసుకోబడ్డ వాళ్ళు ఎక్కువ మందికారు—వాళ్ళు కొద్ది డజన్లమంది.

వీళ్ళంతా యువకులు, ఫైటర్ విమాన చోదకులు, విమానయాన పరిషత్తులో పట్టభద్రులైనవాళ్ళు. మేమంతా అధునాతన జెట్ ఫైటర్లలో ఎగిరాం; వేగానికీ, అంతరిక్షానికీ యిష్టబడ్డవాళ్ళం. అంత మందిమీ—యిప్పుడు నేను బాగా బాధ్యతతో చెప్పగలను—పూర్తిగా ఆరోగ్యవంతులం.

మాలో ఒకరు మొదట రోదసిలోకి ఎగరవలసి వుంటుందని మాకు తెలుసు. ఎవరో ఒకరు తిరిగి భూమికి రాకపోవచ్చుననీ ఒకొక్కప్పుడు మేము అనుకుని వుండవచ్చును. కాని దీన్నిగురించి మేము ఒకళ్ళతో ఒకళ్ళం అనుకోలేదు. ఎంచేతనంటే, మొదటిది యిటువంటి మాటలూ, ఆలోచనలూ మంచి దృక్పథం ఏర్పడడానికి తోడ్పడవు; రెండోది మేమున్నచోటికీ, అంటే దళానికీ, రోదసికీ చాలా దూరం. విశ్వద్వారంవద్ద నిలుచున్న విద్యార్థులం మాత్రమే మేము. అక్కడికి చేరడానికి కష్టమైన సిద్ధాంత, శారీరక శిక్షణను ఒకొక్కరమూ పొందవలసి వుంది.

మా సిద్ధాంత పాఠాల గురించి ఎక్కువగా చెప్పవలసిన పని లేదు. మేము ఖగోళ శాస్త్రాన్నీ, పదార్థ విజ్ఞాన శాస్త్రాన్నీ, అంతరిక్ష యాంత్రిక విషయాల్నీ, రోదసీ యానాన్నీ, రాకెట్ల సిద్ధాంతాన్నీ, రాకెట్ల ఎగురవేతనూ అధ్యయనం చేశాము. రోదసీ జీవ శాస్త్రంలోని సున్నిత విషయాలను కూడా మేము తెలుసుకోవలసి వచ్చింది, పూర్తిగా కొత్తదయిన యీ విజ్ఞానశాస్త్రం

కూడా మాకు సాయపడగలదు గాబట్టి. పుస్తకాలు చదవడానికికూడా వ్యవధి చాలినంత లేదు మాకు, శారీరక సన్నాహాలకు ఎంతో కాలం వ్యయపడుతుండడం వల్ల.

రోదసిలో మానవునికి చాలా ఆశ్చర్యకరమైన విషయాలూ, కష్టాలూ శారీరకమైనవీ, నైతికమైనవీ ఎదురవుతాయని మా శిక్షణాకాలం తొలి రోజుల్లోనే మేము గ్రహించాం. ఈ కష్టాలు ఎటువంటివో ఏ ఒక్కరూ చెప్పలేరు. మాకు శిక్షణనిచ్చే వైద్యులు "పటుత్వం గల శరీరంలో పటుత్వంగల మనస్సు" అన్న అతిప్రాచీనమైనదీ, అతిసాధారణమైనదీ అయిన సూక్తికి పరిమితం అయి వుండేవారు.

శారీరక వ్యాయామాలతో రోదసీ నౌకా చోదకులకు రోజు మొదలవుతుంది. నాకు కసరత్తులంటే యిష్టం. అంచేత నేను సాధారణంగా ఆయా సాధనాలతో వుండిపోయేవాణ్ని, డంబ్‌బెల్స్ తిప్పుతూ వుండేవాణ్ని. కొన్నాళ్ళ తరవాత, గారిడీ విద్యలపట్ల నాకుగల యిష్టం, నన్ను బలూడుా వేపుకు తీసుక వెళ్ళింది. చిన్నతనంలో సర్కస్‌కు వెళ్ళడం నాకు జ్ఞాపకమే. గారిడీ విద్యలు చేసేవారు వలమీద గంతి, పై కప్పువరకూ ఎగిరి, మెల్లగా అందంగా కళ్ళు మిరుమిట్లు గొలిపే దూకులు దూకుతూ, గాలిలో, గింగుర్లు తిరుగుతూ వీపుమీదో, గుండెలమీదో పడి, మళ్ళీ తేలిగ్గా, స్వేచ్ఛగా ఎగిరిపోవడం గుండెలు దడదడా కొట్టుకుంటూ వుండగా చూసేవాణ్ని.

తంత్రి చేతుల్లాగా, గట్టిగా, మెత్తగావున్న శరీరం గాలిలో వున్నప్పటి తేలికగా వుండే క్షణాలు, ఏదో ఒక విధంగా పారవశ్యం కలిగించే క్షణాలు, శరీరాన్ని అదుపులో పెట్టుకొని, పిట్టలాగా ఎగిరిపోయే క్షణాలు నాకు యిష్టంగా వుండేవి. కాని తొందర్లోనే యీ క్షణాలు కొత్త విస్తరించాయి. పారఛూట్ శిక్షణకు కాలం వచ్చింది. దాచడం ఎందుకు ? తొందరగా విమానాల్లో వెళ్ళడానికి అలవాటు పడ్డ చాలా మంది విమాన చోదకులు, యీ పెర్‌కేల్ బట్ట, సిల్కు బరువు మూటకు ఎక్కువ యిష్టపడరన్నది నేనెరుగుదును. ఇది ఎగరడంకోసంకాదు, పడడంకోసం. ఇది మాకు సహాయకారి అనీ, ప్రాణాన్ని రక్షిస్తుందనీ మేము గుర్తిస్తాము. కాని యిటువంటి సమ

యాలు ఎప్పుడూ రాకండా వుంటే మంచిది. అప్పటివరకూ మాలో చాలా మంది అవసరమైనన్ని కొద్దిసార్లు మాత్రమే గంతేరు. వాటిలో మొదటిది మరీ "స్వతంత్రం"గా చేసినది కాదు. కంతలోంచి వైమానికుణ్ణి తోస్తారు బయటికి, బ్రాకేసకు కట్టివున్న తాడు డోమ్ ను లాగుతుంది, అక్కడ అతను వేలాడుతూ వుంటాడు, తనకు తెలియకముందే, పచ్చని విమానాశ్రయం మీద డాండిలియన్ మొక్కలాగా.

మా పారాఛూట్ శిక్షకుణ్ణి నేను మొదట కలుసుకున్న రోజున, గెంతడం గురించి నాకున్న పాత భావాలు తొందర్లోనే పోతున్నాయని గ్రహించాను.

ఎక్కువ పొడగరికాదు, బొద్దుగా వుంటారాయన. కంచుతో చేసిందా అన్నట్టుగా దిట్టమైన గడ్డం. ఆయన మావేపు శ్రద్ధగా చూశారు, "అక్కడ, ఆకాశంలో మీరేం చేస్తారు?" అని అడిగినట్టుగా.

అంతరిక్షంలో ఆయన, పదుల వేల మీటర్ల ఎత్తులనుండి గంతుతూ, రాత్రుళ్ళూ, పవళ్ళూ, మంచుమీదికీ, నీటిమీదికి దిగుతూ, అడవుల్లోకీ, కొండలమీదికీ దిగుతూ ఆయన పదిహేను వందలసార్లీ పని చేశారు. గౌరవ క్రీడావేత్త చిహ్నమూ, గుండెలమీద అనేక వరుసలుగా అలంకరణలూ—యివ్వన్నీ మేము నెమ్మదైన, బలమైన సమర్ధుని చేతుల్లో వున్నామని తెలియజేస్తున్నాయి. ఆయన క్రీడావేత్తే కాదు, కొత్త రకాల పారఛూట్ల పరీక్షకుడు కూడా. మమ్మల్ని, యువకులం, "పరిక్షింపబడని" వాళ్ళమూ అయిన మమ్మల్ని యిప్పుడాయన పరిక్షించాలి.

మొదట మామూలు గంతులు మాత్రమే జరిగేవి. "గంతండి" అంటూ నికొలాయ్ కాన్‌స్తంతినోవిచ్ ఆజ్ఞాపించేసరికి మేము 800 నుండి, వెయ్యి మీటర్ల ఎత్తునుండి విమానాన్ని వదిలి పెట్టేవాళ్ళం. సహాయక సాధనాల సాయంతో పారఛూట్ వెంటనే విప్పుకునేది. నాకైతే తాళ్ళతో వేలాడడమూ, గాలిలో నేలమీద ఆ పెద్ద సిల్కు గుడను అదుపులో పెట్టుకోవడమూ, యీ సుదీర్ఘ కార్యక్రమం అంతా త్వరలోనే నాకు విసుగెత్తించింది. నికొలాయ్ కాన్‌స్తాంతినోవిచ్ యీ గంతులకు మేమెంతగా విము

ఖులమైవున్నామో వెంటనే కనిపెట్టారు.

"కాస్త వుండండి" అని నవ్వుతూ చెప్పి, "యింకో గంతు గెంత నివ్వండని తొందర్లోనే మీరు అడుగుతారు" అంటూ అన్నారాయన.

అప్పుడు ఆయన చెప్పిన దాంట్లో నాకు నమ్మకం కలగలేదు. కాని తర వాత, ఆలస్యంగా దింపే గంతులో వున్న ఉద్రేకాన్ని అనుభవించేక, నికొలాయ్ కాన్‌స్తంతినోవిచ్ మాటలు నాకు జ్ఞాపకానికి వచ్చాయి. కొద్ది సెకండ్లు ఆకాశంనుండి పిట్టలాగా నేలకు దూసుకుంటూ వచ్చేటప్పుడు మని షికి కలిగే అనుభవంకంటే, యింకేది బాగుంటుంది వాస్తవానికి?

భూమికి లక్ష్యం వేపుకు దూసుకుంటూ వచ్చే పక్షి.

ఆలస్యంగా జరిగే గంతును రాంగ్ ఆరమ్ మోషన్లో చేసి, ఒక స్పిన్ లోకి చేసినప్పుడు, నేనిది గుర్తించాను. ఒక బలవత్తరమైన శక్తి నా శరీరాన్ని ఆకట్టుకుంది, తిప్పివేస్తూ, గింగిరాలుకొట్టిస్తూ. ఒక బ్రహ్మాం డమైన డబ్బాలోకి పడిపోతున్నానేమో అని అనిపించింది నాకు. నిర్దాక్షి ణ్యంగా సెంట్రిపెటల్ శక్తి నన్ను ఎంత బలంగా పట్టుకుందంటే, నన్ను నిటారుగా చేసుకోవడానికీ, స్పిన్ లోంచి బయటపడి, మామూలుగా దిగు వకు రావడానికి నాకసలు సాధ్యపడదేమో అనిపించింది.

ఇటువంటి స్పిన్‌లలో తరచుగా కళ్ళలోకి రక్తం వస్తుందని మాకు తెలుసు. కాని తెలిసి వుండడం ఒకటీ, దాన్ని అనుభవించడమూ, దాన్ని గడవడం యింకొకటీ, భూమి అంత వేగంగా తనకు చేరువయిపోతున్న ప్పుడు ముఖ్యంగా.

స్పిన్‌లోంచి ఎలా బయటపడాలో మాకు చెప్తుతూ మా బోధకుడు చెప్పిన సలహా నా తలలో మెదులుతూవుంది. నా చేతులు ఒక పక్కకు వెళ్ళాయి, కష్టంగా; నా కాళ్ళు కాస్తంత వంగాయి; భూమి గిరగిరా తిర గడం ఆగిపోయింది. నేను యింకోసారి దానివేపుకు వెళ్ళాను.

పారచూట్ యింకా విప్పుకోలేదు, కాని గాభరాపోయింది, ఇది అదృష్టమేమీ కాదు. నికొలాయ్ కాన్‌స్తాంతినోవిచ్ మాకు పారచూట్లను నిలవలోంచి తీసి యివ్వలేదు ఎన్నడూ. గంతడానికి ముందర ప్రతిసారీ

మాచేత అమరిక చేయించి, మడిపించేవారు. అంచేత దాని పద్ధతి నమ్మక మైనదని తెలిసి వుండడంవల్ల, మాకు మాలో నమ్మకం కలిగేది.

మేము పగటిపూట గంతేవాళ్ళం, రాత్రుళ్లూ గంతేవాళ్ళం. మేము భూమిమీదా గంతేవాళ్ళం, నీటిమీదా గంతేవాళ్లం. నేల ప్రపంచంలో పది హేడు శాతమే గదా. చంద్రమండలంనుంచి తిరిగివచ్చే రోదసీ నౌకా చోద కుడు గురితప్పి, ఓల్గా స్టెప్పీలకు బదులుగా ఎర్ర సముద్రంలో పడ వచ్చును.

అసలు విషయమేమిటంటే, పారచూట్ మీదినుండి గెంతడం అంటే మాకు యిష్టం ఏర్పడింది. పారచూట్ మాకు అభిమాన పాత్రమయ్యింది. ఒకొక్కప్పుడయితే మేము నికొలాయ్ కాన్ స్తంతినోవిచ్ దగ్గరకెళ్ళి "నన్ను గెంతమంటారా?" అని అడిగేవాళ్లం.

వాతావరణం సరిగావుండి, విమానం సిద్ధంగా వున్నట్టయితే, మేము మా పారాచూట్లను మడతపెట్టుకుని, మళ్ళీ భూమికి ఎగిరివచ్చే వాళ్లం.

కాని యిదంతా మామూలు "భూసంబంధమైన" శిక్షణ. "రోదసికి సంబంధించిన కట్టుదిట్టం" యింకా చిక్కు విషయం. మొదట రాకెట్లనూ, స్పూత్నిక్కులనూ పంపినప్పుడు తెలిసిందేమిటంటే, రాకెట్ ఇంజిన్‌ను నడపడం మొదలు పెట్టినప్పుడు రాకెట్టుకూ, దాని చివరనున్న రోదసీ నౌకకూ ప్రకంపనాలు కలుగుతాయని. ఇప్పటి వరకూ ఆ ప్రకంపనాలను తొలగించడం అసాధ్యంగా వుంది. ఎంచేతనంటే—రాకెట్టును ఎంత శ్రేష్ఠంగా చేసినా, ఎంత బాగా అమరిక చేసినా, రోదసిలోనికి రాకెట్టును పంపించే లక్షోపలక్షల అశ్వశక్తిని సమశ్రుతిలో పనిచేయించడం యింకా కష్టంగానే వుంది. స్పూత్నిక్కులలోని కోశాల యాంత్రిక విభాగాలు యీ ప్రకంపనలకు లోనయ్యాయి, కుదుపు పరిస్థితిలో పని చేసే మనుష్యులకు కూడా యిదే జరుగుతుంది. ఇది శరీరానికి ప్రమాదకరమైనది కాదు, కాని దానికి అలవాటుపడాలి. మమ్మల్ని ప్రకంపన సాధనాల్లో పెట్టి, కుదుపుతో మా ప్రాణాలను బయటికి నెట్టే వారు. డాక్టర్లు యీ విషయంలో నిర్దాక్షిణ్యంగా వుండేవారు. హృదయకోశం పనిలో ఎంత చిన్న మార్పు వచ్చినా

సరే కొలిచే తమ పరికరాలంత నిర్దాక్షిణ్యంగా వుండేవారు వాళ్ళు.

ఏరివేత జరుగుతూ వున్న కాలంలో, సెంట్రీ ఫ్యూజ్ చాలామందికి ఒక హద్దుగా వుండేది. ఆ తరవాత అది నిర్దాక్షిణ్యమైన వాటిలో ఒకటిగా వుండేది, కాని మా యాత్రా శిక్షణకు మంచి సహాయకారిగా వుండేది.

కృత్రిమ భూ ఉపగ్రహం కక్ష్యలోకి వెళ్ళడానికి, ప్రధమ కాస్మిక్ వేగాన్ని అది అందుకోవాలి, అంటే సెకండుకు సుమారు 8 కిలోమీటర్లు, లేదా గంటకు సుమారు 29,000 కిలోమీటర్లు.

రాకెట్టు, రెండవ రోదసీ వేగంలో భూమ్యాకర్షణ రంగం నుండి తప్పించుకోగలదు. ఈ వేగం సెకండుకు 11 కిలోమీటర్లకు పైగా వుంటుంది. రోదసీ నౌకకు యిటువంటి వేగాన్ని కల్పించినప్పుడు, మన సౌర వ్యవస్థలోని ఏ గ్రహానికైనా అది వెళ్ళగలదు. సెకండుకు సుమారు 17 కిలోమీటర్లు గల మూడవ రోదసీ వేగం, నౌకను సౌర వ్యవస్థ బయటికి తీసుకవెళ్ళి, దాని యితర గ్రహ కూటాలకు తీసుకవెళ్ళగలదు.

ఇటువంటి వేగాలకు రోదసీ నౌకా చోదకుడు తట్టుకోగలడా? రోదసీ యాత్రకు మేము సన్నాహమవుతున్నప్పుడు, మేము అనుభవించవలసి వచ్చే వేగాలకూ, వేగాల హెచ్చింపులకూ సంబంధించిన విషయాలనన్నిట్నీ మేము తెలుసుకోవలసి వుంది. వాటిని తెలుసుకోవడమే కాదు. వాటికి అలవాటు పడవలసివుంది కూడా.

ఒకే వేగంలో చలనానికి శరీరం ప్రభావితం కాదనికూడా మేమెరుగుదుము—అది ఎంత వేగం అయినప్పటికీ. ఒక సెకండుకు యించుమించు 30 కిలోమీటర్ల వేగంతో మనం భూమితోబాటుగా సూర్యునికి ప్రదక్షిణ చేస్తున్నాము. ముఖ్యవిషయం, బాహ్య పరిస్థితుల ప్రక్రియల నుండి విడిపడడం, భూమిమీద మానవుడు వాతావరణపు దట్టమైన పొరలవల్ల, బాహ్య పరిస్థితుల నుండి విడిపడి వున్నాడు, లేదా రక్షితుడై వున్నాడు; రోదసీ నౌకా చోదకుడు కోశపు సన్నని గోడలవల్ల విడిపడి వున్నాడు. కాని రాకెట్ ప్రారంభ చలనంవల్ల వచ్చే తీవ్రమైన వేగోత్కర్షణలు, లేదా రాకెట్ భూమికి దిగడానికి సన్నాహమవుతోంటే భూమి వాతావరణం పొరలతో సంబంధానికి

రావడం వల్ల కలిగే తీవ్రమైన వేగోత్కర్షణలు ఫలితాలనిస్తాయి. రోదసీ నౌకా చోదకుడు అపారమైన భారాన్ని అనుభవిస్తాడు.

సెంట్రీఫ్యూజ్‌లో మేము శిక్షణను పొందుతూ వున్నప్పుడు, కష్టం కలిగించేవీ, మొదట్లో యాతన పెట్టేవీ అయిన పెద్ద శ్రమ ఫలితాల్ని కాల క్రమాన కొంతవరకూ బాగా ఓర్చుకోవచ్చునని మేము గుర్తించాము.

ఊపువంటి సామాన్య విషయాన్నే తీసుకోండి. బాల్యంలో పైకి ఎత్తుగా వెళ్ళి, గుండె దడదడా కొట్టుకుంటూవుంటే దిగువకు గభాలున రావడం యిష్టం కానిదెవరికి ? అయితే ఉయ్యాలలు పిల్లలకు బాగానే వుంటాయి, పది నిమిషాలపాటు. కాని వేలాడగట్టబడిన కుర్చీలో మిమ్మల్ని కూచోబెట్టి, మోటారుని తిప్పినప్పుడు, ఒక గంట, రెండు గంటలూ, మూడు గంటలూ అదే విస్తీర్ణంలో మీరు ముందుకూ వెనుకకూ ఊగినప్పుడు అది కాస్త అతి అవుతుంది. బలహీనమైన కుహరిక వ్యవస్థ గల వ్యక్తి త్వరలోనే తీవ్రమైన కడుపులో తిప్పుడుకు గురి అవుతాడు. ఇదంతా అనుభవించాలనీ, దాన్ని భరించాలనీ, దిద్దుకోవాలనీ మాకు తెలుసు—రోదసీ నౌకా చోదకులం అవుదామనుకుంటే.

మా శిక్షణకు డాక్టర్లు ఎప్పుడూ కొత్తకొత్త పద్ధతులు ఆలోచిస్తూ వుండేవారు.

ప్రశాంతతను కోరుకోనివాళ్ళు, గోలగా వుండే పెద్ద నగరాలలో ఎవ్వరుంటారు ? అలసిపోయిన వారికెవరికైనా వైద్యుడు మొట్టమొదట విశ్రాంతి తీసుకోమని సలహా యిస్తారు, ప్రశాంతంగా వుండమని కూడా చెపుతారు. పారంలేని మైదానంలోకో, లేదా దట్టమైన అడవిలోకో నిశ్శబ్దంగా, ఆకైనా అల్లాడని చోటికి వెళ్తే ఎంత బాగా వుంటుందో మీకు జ్ఞాపకం వుందా ? శాంతి ప్రశాంతతల రాజ్యంలోనికి మీరు వచ్చినట్టుగా అనిపిస్తుంది; ఒంటరితనం అనిపించదు. ఎంచేతనంటే నిశ్శబ్దత అప్పుడు సైతం ప్రశాంతంగా సాగుతూ వుంటుంది గాబట్టి. గాలి భూమిమీద వున్న మనల్ని ఆవరించుకుంటుంది, దాని కెరటాలు గడ్డి పోచ అతిచిన్న కదలికనైనా, ఏదో మిడత చప్పుణ్ణయినా, మెత్తని కుళ్ళిన పదార్థంలో పడే హిమకరణం చప్పుడైనా

చెవుల వద్దకు తీసుకవస్తాయి. మీరు వాయు సాగరంలోకి ప్రవేశించినప్పుడు, మీరు అందుకోలేని అబ్బురమైన శృతులుగా యివన్నీ మారిపోతాయి. వీటిని భూమిమీద మనం "ప్రశాంతత" అన్న సర్వార్థక పదంగా వాడుక చేస్తాం.

రోదసిలో గాలి లేదు. గాలి కెరటాలు ఏర్పడడానికి అక్కడ ఏదీ లేదు—శబ్దాలను ప్రసారంచేయడానికి ఏదీలేదు. అంచేత విశ్వంలో ఎక్కడో దేవుడున్నట్టయితే, పాపులమైన మన ప్రార్థనలు ఆయన వద్దకు వెళ్ళవు. అక్కడ చెవిదగ్గరగా తుపాకి పేల్చితే, ఆ భూలోకవాసికి వినిపించదు. రోదసిలో నిశ్శబ్దం కూడా మనిషికి పరమ శత్రువుగా మారిపోవచ్చును. దాన్ని తట్టుకుని, యీ నిశ్శబ్ద ఏకాంతంలో గుండె దిగజారి పోకండా వుండ గలిగేందుకు, డాక్టర్లు మాకు శిక్షణ నివ్వడంకోసం భూమిమీద విశ్వంలో ఒక భాగాన్ని ఏర్పరిచారు.

మేము ఎదుర్కోబోయే నిశ్శబ్దపు పరీక్ష గురించి కొందరు "దీన్ని గురించి బాధపడ్డం ఎందుకు ! ఏమీ లేకపోతే మేము ఊరకే నిద్రపోతాం !" అని అన్నారు.

అలా కాదన్నారు డాక్టర్లు. "ఛార్టులో వేసినట్టుగానే మీరు నిద్రపోవాలి. ఛార్టు ప్రకారం నిద్రలేవాలి, పని చెయ్యాలి, మీరింకేమీ చెయ్యకపోయినా సరే. మీ విషయంలో యిదెలా జరుగుతుందో చూద్దాం."

అంచేత ఒక రోజున, రెండు మూడు వారాలు ఎక్కడికో వెళ్ళి వస్తానని నా భార్యకు చెప్పాను.

తమారా నా సంచిని సిద్ధం చేసింది, నేను కారెక్కాను. డ్రైవరు మోటారు నడిపాడు, ఆ "గజిక్" దూసుకపోయింది. త్వరలోనే నేను నిర్ణీత స్థలం చేరుకున్నాను. నేనా సంస్థలోపలికెళ్ళాను. అక్కడొక యంత్ర వ్యవస్థ వుంది, "చెముడు గది" అన్న వింత పేరుతో.

"చెముడు గది" అన్నది చాలా పెద్ద కట్టడం, మూడు గోడల వెనక నుంది, మృదువైన, సాగే షాక్ అబ్సార్బర్లమీద అమర్చివుంది. అది చిన్న గది, చాలా లేతరంగు సాగుడు పదార్థాలతో దాని పైకప్పు, గోడలూ కప్పి

వున్నాయి. రోదసీ నౌకలోని కుర్చీ పోలికగల కుర్చీ ఒకటి ఒక మూలలో వుంది. దానికి పక్కగా కంట్రోల్ పానెల్, రేడియో రిసీవర్లు, ట్రాన్స్‌మిటర్ల స్విచ్‌లున్నాయి. ఒక చిన్న అలమరాలో చాలా రోజులకు సరిపడే ఆహారమూ, ఒక గడియారమూ వున్నాయి. గడియారం టిక్కుటిక్కుమంటుంటే నిశ్శబ్దానికి అలవాటు పడిపోతారు. కాని యీ గడియారం చప్పుడు చెయ్యదు.

నేను లోపల వుండగా బరువైన తలుపులు మూసుకున్నాయి, నేను ఒంటరిగా వుండిపోయాను.

మొదటి రెండు రోజులూ అనుకోకుండానే గడిచిపోయాయి. నిర్ణీత సమయంలో నేను "భూమి"ని పిలిచాను. జవాబేమీ రాకపోగా మామూలు ప్రసారపు పనిని సాగించాను. ఆజ్ఞలు రావడంతో పుస్తకంలో, పరికరాల పనిని గురించీ, కౌంటర్లలోని అంకెలనూ, నా పరిస్థితి గురించీ రాశాను. ఉదయం డంబ్‌బెల్స్‌తో వ్యాయామం చేసేవాణ్ని. ఆ గ ది ని భూలోకపు యిల్లులా వుండేటట్టు చెయ్యటానికి, నేను పాడడానికి లంకించుకున్నాను. కాని నా గొంతు గుల్లగా, వింతగా వినిపించింది. మా పాఠశాల బృంద గానం జ్ఞాపకానికి వచ్చింది. అప్పుడు ఏభై మంది బాలబాలికలం స్నేహితుల్లాగా కలిసి పాడేవాళ్ళం, మా చిన్న గ్రామం క్లబ్బు హాలు గోడల్ని కదిల్చేసే వాళ్ళం. ఆ బృంద గానమే బాగుండేది. ఒకరు కీచుపెట్టినా, తక్కిన నలభై తొమ్మిది గొంతులూ దాన్ని కప్పివేసేవి, తాను మళ్ళీ పాటను సాగిస్తూ సరిదిద్దుకోవచ్చు. కాని యిక్కడ....

ఏమైనా సరే నేను పాడేను, కీచులు పెడుతూ కూడా. అప్పుడు డాక్టర్లు నా పాటను వింటూ వున్నట్టయితే, నేనా సంగీత కచేరీలు చేసినందుకు వాళ్ళు నన్ను క్షమించగలరని ఆశిస్తున్నాను.

ఈ చెముడు గదిలోకి నాకు ముందర వెళ్ళినవాళ్ళు చెప్పినదాన్ని బట్టి, యిది సులువు కాదని నాకు తెలుసు. ఈ ఏకాంతానికి వెళ్ళినప్పుడు రహస్యంగా నేను పుష్కిన్ పద్యాల సంపుటాన్ని తీసుకవెళ్ళాను. నాలుగోరోజు సరికి నాకు ఇవ్‌గెని ఒనెగిన్‌లో ఒక ప్రకరణం కంఠస్థమైపోయింది.

కవిత్వం చాలా బాగుంటుంది సరేగాని, విశ్వంలో సైతం మానవుడు ఉత్సాహం ఒక్కదానితోనే జీవించలేడు. నేను భోజనం తయారు చేసుకోవలసి వుంది. స్త్రీల జీవితం ఎంత కష్టమైనదో రెండోరోజు సరికి గ్రహించాను. భోజనం వండుకోవడం బాగానే వుంటుంది, దాన్ని యిష్టంగా తినడం యింకా బాగుంటుంది. కాని పాత్రలు కడగడమో !

ఇది నాకిష్టంలేదు. ఈ యిష్టంలేని పనిని పూర్తిగా వదిలిపెట్టెయ్యడానికి, నా భోజనానికి ఒక కొత్త పద్ధతి ఆలోచించాను. మా ఆహారం డబ్బాతో వచ్చేది. రకరకాల కాన్‌సోమ్స్, సూపులూ, స్ట్యూలూ, తక్కిన తినుబండారాలూ వుండేవి, టిన్ను డబ్బాల్లో. నేను పాత్రలో నీళ్ళుపోసి, దాన్ని ఎలెక్ట్రిక్ ప్లేటుమీద పెట్టి, ఉడికించేవాణ్ణి: తరవాత దాన్ని డబ్బాలో పోసేవాణ్ణి. కాస్సేపట్లో కుతకుతలాడే నీళ్ళు సగం తయారు చేసిన వస్తువును పూర్తిగా సిద్ధపర్చేవి. నేను చేయవలసిందల్లా డబ్బాను విప్పి, మామూలు మధ్యాహ్నపు భోజనాన్నో, ఉదయపు భోజనాన్నో, లేకపోతే రాత్రి భోజనాన్నో తినేసి, ఆ కాళీ డబ్బాను అంతటా బంధించివున్న చెత్త డబ్బాలోకి గిరాటు వేసేవాణ్ణి.

నిమిషాలు, గంటలు, రోజులూ యీడుస్తూ గడుస్తున్నాయి. కాలం అంతులేకుండా సాగుతుందన్న భావం నాకు కలగ లేదు. నేను పంపే రేడియో వార్తలన్నీ ఏక మార్గంలో వుండేలాగున డాక్టర్లు చేశారు. పరికరాల పనినిగురించి నేను తెలియజేశాను, నా పరిస్థితి గురించి తెలిపాను, ఎవరో తెలియని మనిషికి గాలిలోని చెమ్మగురించీ, ఉష్ణోగ్రత గురించీ అంకెలు పంపించాను. కాని యీ పొడవాటి రోజుల్లో ఎన్నడూ నాకు జవాబు రాలేదు.

ఇది చాలామందికి అగ్ని పరీక్ష అని నాకు తెలుసు.

ఒక మనిషికి ఏ పనీ లేకుండా, మనస్సు స్వేచ్ఛగా వుంటే, అతనికి ఆలోచించడానికి ఏమీ లేకుండావుంటే, అతను అనాది ప్రపంచానికి చెందినవాడయితే, అతను సులువుగా ఒక నిమిషం ఏకాంత విషాదంలో పడిపోతాడు. వెంటనే ఎదుర్కోకపోతే దిగులు ప్రమాదకరమైన క్రిముల్లాగా తీవ్ర

మైన వ్రణాన్ని పుట్టిస్తుంది. అప్పుడు బాధలు వస్తాయి, మనిషికి తనమీద పట్టు తప్పిపోతుంది.

ఈ వ్రణానికి నేను తిరుగులేని మందు కనిపెట్టాను. నాకు ఎవ్‌గెని ఒనెగిన్ కంఠస్తమయ్యాక, పెన్సిలు తీశాను. నేను మరీ బాగా బొమ్మలు వెయ్యలేను. నా బాల్యంలో రెండుసార్లు మాత్రమే శ్రద్ధగా బొమ్మలు వేశాను. మొదటిది, మయకోవ్‌స్కీ అద్భుత కావ్యం లెనిన్‌ను చదివాక, వ్లాదిమిర్ ఇల్యిచ్ బొమ్మను పెన్సిల్‌తో రెండు వారాల పాటు వేశాను. అప్పుడు నన్ను మా నాన్నగారు మెచ్చుకోవడం నాకు జ్ఞాపకం వుంది.

రెండోది, పెచొరిన్ బొమ్మ వేశాను. లెర్మంతోవ్ వచనం నాకు చాలా యిష్టం. దానిలో, స్ఫటికలో వున్నట్లుగా, రష్యన్ భాషలోని ఉత్తమమైనదల్లా, కాంతివంతమైనదల్లా, వివేకమైనదీ, పరిశుద్ధమైనదీ అంతా వున్నదనిపిస్తుంది నాకు. ఇంతకంటే—పెచొరిన్ అంటే నాకిష్టం—బలమూ, గాఢమైన భావాలూ గల, తన శక్తితో ప్రజలకు శ్రేయస్సు చేకూర్చడానికి వీలయ్యే ఆ అదృష్ట దేశాన్ని కనుగొనలేకపోయిన పెచొరిన్ అంటే నాకిష్టం. లెర్మొంతోవ్ చిన్న కథలో అతను కొద్దికాలమే బ్రతికాడు, మంచి పనుల కంటె చెడ్డ పనులే ఎక్కువ చేశాడు, అయినా "ఉత్తములు" పనికి రాని వాడిగా లెక్కగట్టినప్పుడు మనిషిలో ఎంతటి అందంవుందో చూపాడాయన. పెచొరిన్ గురించి ఏనాటివో నా బాల్యపు ఊహలివి.

చెముడు గదిలో నా పెన్సిలు తీసినప్పుడు కాగితం మీదికి వచ్చినవి నా కొత్త కథానాయకుని స్థూల రేఖలు. నాలుగు రోజుల తరవాత, టెలివిజన్ తెరమీద త్సియోల్కోవ్‌స్కీ చిత్రాన్ని చూసి తాము ఆశ్చర్యపడ్డామని, డాక్టర్లు చెప్పారు నాకు తదుపరిని. నా "సృజనాకృషి"ని పొగుడుతూ మాటాడేరు. కాని దీంట్లో నాకు పెద్దగా ఆసక్తి కలుగ లేదు. నా బలవంతపు నిర్వ్యాపారతకు పరిష్కారాన్ని కనుగొన్నాననే నేను సంతోషపడ్డాను; కలూగాకు చెందిన ఆ అద్భుత ప్రతిభాశాలి బొమ్మనుగీస్తూ నేను కాలాన్నే మర్చిపోయాను.

దీని తరవాత యింకా ఎక్కువగా బొమ్మలు గీయడానికి నిర్ణయించు

కున్నాను. నా నోటు పుస్తకంలోంచి చింపిన కాగితాలమీద రకరకాల పుట్‌బాల్ ఆటగాళ్ళ చిత్రశాలే ఒకటి క్రమక్రమంగా తయారయ్యింది. ఈ చిత్రాల్లో నాకున్న ఆసక్తిల్లా నన్నూ, నా పరిశీలనా శక్తినీ పరీక్ష చేసుకోవడమేనని నేను త్వరలో గుర్తించాను. పెనాల్టీ కిక్కుకు ఎదురు చూస్తూ భయంతో ఒణికిపోతూవున్న గోల్ కీపర్‌నూ, బంతిని తన్నే వాని కాలి ఊపునూ, అభిమానుల ముఖాలలోని భావాలనూ, ఉద్రేకాలనూ నేను చిత్రించడానికి ప్రయత్నించాను. అప్పుడప్పుడు నేను చాలా దూరపు ప్రపంచంలో ప్రవేశించేవాణ్ని—ఎందుకు ప్రవేశించకూడదు? మనస్సు ఆరోగ్యంగా వుంటే, శరీరం కూడా బలంగా వుంటే—కొన్ని కాగితాలమీద యించుమించు చైతన్యం లేకుండానే ఎంతో వింతైన, ఎంతో సుందరమైన శుక్రుని రూపాలు అవతరించాయి. ఇవి గ్రహానివి కావనుకోండి.

రెండువారాలకు పైనుండీ డాక్టర్లు నన్ను చెముడు గదిలో వున్నప్పుడు పరిశీలిస్తున్నారు తెరిపిలేకుండా. నన్ను నేను చూసుకోలేను. నన్ను బయటికి తీసుకవచ్చాక అద్దంలో చూసుకుని హడిలిపోయాను. దట్టంగా, గడ్డం యించుమించుగా నా ముఖం అంతా కప్పివుంది. ఆ సంస్థలో గడ్డం చేసుకోడానికి వేచివుండకుండా, యింటికి పరుగెత్తాను. యువకులైన క్యూబన్ "బర్బుడోస్" నాకు నచ్చారు. అంచేత వాళ్ళలాగా కనిపిస్తూ తమారా ఎదుట కెళ్ళాలను కున్నాను.

"గెరా, ఎక్కడికెళ్లావు? పైగాకా?" అని ఆమె అడిగింది. "క్షవరం చేసుకోలేకపోయావా? అక్కడ మంగలి పనివాళ్ళు లేరా?"

"క్షవరం చేసుకోలేదు. ఇంకా లేరు. కాని కొన్నాళ్ళుండు. అక్కడ కూడా క్షౌరశాలలు వస్తాయి. అప్పుడు భార్యల వద్దకు సరైన ఆకారాల్తో మేము తిరిగి వస్తాము."

సోవియట్ భూమి 18వ సంచికకు అనుబంధం, సెప్టెంబరు 1962

# రోదసి ఊపిరి

రోదసీ నౌకా చోదకునిగా నా జీవితానికి నిజంగా ప్రారంభమేదా అని నేను ఆలోచించినప్పుడు, రోదసి అందుబాటులో వున్నదని నేను మొదట అనుకున్నప్పుడనిపిస్తుంది. నన్ను డాక్టరు "అర్హు"ణ్నని ఎప్పుడు ప్రకటించారో నాకు జ్ఞాపకం లేదు. దళంలో చేర్చుకోబడిన రోజూ, సోవియట్ సేన విమానబలం సర్వసేనాని మార్షల్ వెర్షినిన్, గ్రీన్ లెప్టెనెంట్సైన మమ్మల్ని ఆహ్వానించిన సమయం కూడా నాకు జ్ఞాపకం లేదు.

సర్వసేనానిని మేము కలుసుకున్నప్పుడు, ఊరకే పరిచయం చేసుకోవడానికి; అంతంలేని, ఎవ్వరూ ఎరగని రోదసిని మొట్టమొదటగా అన్వేషించే వారిని పరిచయం చేసుకోవడానికి ఆయన మమ్మల్ని పిల్చారని మేము గట్టిగా భావించాము. మార్షల్ మాతో చాలా సేపు, ఒకొక్కరితో వ్యక్తిగతంగా మాటాడేరు. ఆయన మా ఆరోగ్యం గురించీ, దీన్ని మేము ఎలా భావిస్తున్నామనీ అడిగారు. మా భార్యల గురించీ, మా పిల్లలగురించీ, మా పథకాల గురించీ అడిగారు. మార్షల్‌తో ఆయన కార్యాలయంలో, విమాన యాన శాఖ లెప్టెనెంట్ కల్నల్, సోవియట్ దేశ వీరబిరుదాంకితుడూ అయిన నికొలాయ్ పెత్రోవిచ్ కమనిన్ వున్నారు. బాల్యంలో సైతం నేను, తనవంటి పరమ సాహసులు ఐదుగురితో, "చెల్యుష్కిన్" శిబిరంలోని ముక్కముక్కలుగా వున్న మంచుమీద విమానంతో వెళ్ళిన యీ నిదానస్తుడూ, ధైర్యశాలీ అయిన యీయన గురించి ఎంతో విన్నాను, ఎంతో చదివాను. ఇప్పుడీయన ప్రఖ్యాత వీరుడు, ఆయనకున్న బంగారు తారమీద "రెండవ" అంకె వుంది. ఆయన మాకు మార్గదర్శి.

రోదసి ఊపిరిని నేను తొలిసారి అనుభవించింది, రోదసీ నౌకల ప్రధాన డిజైనర్ తనను కర్మాగారంలో కలుసుకోమని పిలిచినప్పుడు.

ఆయన గురించి త్వరలోనే మంచి వ్యాసాలూ, పుస్తకాలూ, పద్యాలూ తప్పక వస్తాయని నా నమ్మకం. ఆయన అంత గొప్ప వ్యక్తి. ప్రజలు తెలుసుకోవాలి ఆయన ఎలా జీవించారో, ఆయన చిన్నతనంనుండీ విమాన యానానికెలా పూర్తిగా అంకితమైపోయారో. తరవాత 1932 లో మొదటి సోవియట్ రాకెట్లు ఒకటిన్నర కిలోమీటర్లు వాతావరణంలోకి లేచి నప్పట్నుండీ ఆయన రాకెట్ నిర్మాణంపట్ల ఆకర్షితులయ్యారు. "ఆకర్షితు" లయ్యారంటే అది దీన్ని సరిగా వివరించడమే కాదు.

యవ్వనోత్సాహమూ, పట్టుదలా, మంచి విద్య, దూరదృష్టి గలిగి, ఆయన ఎన్నో ఏళ్ళుగా రోదసీ నౌకల్నీ, రాకెట్ ఇంజన్లనూ నిర్మించాలని అభిలషిస్తూ, వాటి నిర్మాణంకోసం కృషి చేస్తున్నారు.

విమానాల డిజైనర్లు కొంత అనుభవజ్ఞులయినట్టయితే, తమ సాహసికమైన భావాలను అమలులో పెట్టగలుగుతారు, గాలి సముద్రంలో ఒక కొత్త విమానాన్ని పరిక్ష చెయ్యగలుగుతారు, ఎయిరో డైనమిక్స్ సూత్రాల ప్రకారం తమ తప్పుల్ని దిద్దుకోగలుగుతారు; కాని ప్రధాన డిజైనర్ విషయం వేరు. వైజ్ఞానిక శాస్త్రజ్ఞుల బృందం గణితాలు కొన్ని ప్రసిద్ధ ప్రతిపాదనలమీదా, ధైర్యంగా చేసే అంచనాలమీదా, ఊహల మీద మాత్రమే ఆధారపర్చడం సాధ్యపడుతుంది.

విషయమేమిటంటే ప్రధాన డిజైనర్‌కు మొదట చాలా గడ్డుకాలం. చాలామంది ఆయనను ఉత్త కలలుకనే మనిషిగా లెక్కకట్టారు. ఆయనలో నమ్మకం కలగలేదు వాళ్లకు. తరచు ఆయన తన పథకాలతో, ముసాయిదాలతో ఏకాకిగా వుండిపోయేవారు. గతంలో తనకు కలిగిన యీ కష్టాలగురించి ఆయన మాతో ఎన్నడూ మాటాడలేదు; కాని వాటిగురించి మాకు తెలిసింది. అంచేత యీయన దీక్ష విషయమై మాకు ఎంతో గౌరవాభిమానాలు కలిగాయి.

ఆయన రూపురేఖలను చిత్రించడం చాలాకష్టం. ఆయన మరీ పొడగరి కాదు, అయితే బలిష్టంగా విశాల వక్షంతో వుండేవారు. ఆయన తలను ఏవిధంగా వుంచుకొనేవారంటే, మీ వేపు విచారంగా, కోపంగా చూస్తూ

న్నారా అని అనిపిస్తుంది. కాని మిమ్మల్ని తేరిపార చూసినప్పుడు, ఆయన దృఢ దీక్షేకాకుండా, డిజైనర్, గణితశాస్త్ర వేత్త నిశితమైన బుద్ధేకాకుండా, ఉదారబుద్ధిగల ఒక దృఢమైన మానవుని శ్రద్ధ, మంచితనమూ కూడా మీకు కనిపిస్తాయి.

మేమాయనకు కొడుకులమా అన్నంత ప్రేమగా ఆయన మమ్మల్ని పలకరించారు. రోదసీ నౌకలున్న కర్మాగారంలోకి మమ్మల్ని తీసుక వెళ్ళారు. వాటిలో అంతా పూర్తయి వున్న ఒకదాని దగ్గరకెళ్ళి, "సరే, అదిగో అది. దాన్ని చూడండి. దానిమీదే మీరు ఎగరబోతున్నారు. ఊరక నే చూడవద్దు, బాగా పరిశీలించండి. ఏదేనా లోపముంటే చెప్పండి. మనం కలిసి సరిచేద్దాం. దాన్లో ఎగిరేది మీరుగాని, నేను కాదు" అని మామూలుగా అన్నారు.

మా మొదటి విజయాన్ని సాధించిన స్పూత్నిక్-1 అప్పటికే రోదసి లోకి వెళ్ళింది. ప్రసిద్ధిగన్న లైకా అన్న కుక్క భూమికి పైగా వందల కొలదీ గంటలు గడిపింది, ప్రపంచమంతా గుండెలు కొట్టుకుంటూ వుండగా దాని హృదయ స్పందనాలను గమనించారు. రానురానూ ఎక్కువగా, యింకా పెద్దవీ, క్లిష్టమైనవీ నౌకలు రోదసిలో కెళ్ళాయి. చివరికి మేము వాటిలోని ఒక నౌకను చూశాము, దీనిమీద దేవతల కథల్లోని మనిషి కాదు, మాలో ఒకరు భూమికి ఆవలకు వెళ్లబోతున్నారు.

ఆ నౌకలోకి మొదట ఎవరు ఎక్కారో నాకు జ్ఞాపకం లేదు. కాని నేను వెళ్తే, చాలా సేపు కనిపెట్టుకున్నాక ఒక కొత్త విమానం కాబిన్లో కూచునే టెస్ట్-వైమానికులందరూ అనుభవించే ఉద్రేకం నాకూ కలిగింది. ఏ ఒక్కరూ దాన్లో ఎగిరి వెళ్ళ లేదు; అది డ్రాయింగుల్లోనూ, గణితా ల్లోనూ మాత్రమే వుంది. అదుగో అదిక్కడ—సిద్ధంగా వుంది. జెట్ ఫైటర్ విమానంలోని వైమానికుని కాబిన్లో కంటే నౌకలోపల ఎక్కువ విశా లంగా వుంది. ఒక పెద్ద ఎయిర్ లైనర్ల కంటె కూడా ఎక్కువ విశాలంగా వుంది. అంతా మెరుస్తూ, ఫలరహితంగా, అస్పృశ్యంగా వుంది. మీరు స్వేచ్ఛగా, నిరాసక్తంగా సదుపాయమైన దాని మెత్తని కుర్చీలో కూచో

వచ్చును. ఎడమవేపు కంట్రోల్ పానెల్ వుంది, కళ్లకు నేరుగా ఓరియం టేటర్, ఒక చిన్న భూగోళం నమూనా వున్నాయి. ఇవి క్లిష్టమైన కంప్యూ టింగ్, ఎలక్ట్రానిక్ యాంత్రిక పరికరాల ద్వారా ప్రతి సకండుకూ భూమికి సంబంధంగా నౌక వాస్తవస్థితిని చూపగలుగులాయి.

ఆ రోజు మేము ఒకొక్కళ్ళమూ ఆ రోదసీ నౌక కుర్చీలో కొద్ది నిమిషాలు కూచొని, గొప్ప ఉద్రేకంతో బయటికి వచ్చాము. ఆ కొద్ది నిమి షాలు, మేము యీ నౌకను యావత్తు సోవియట్ ప్రజలూ, సర్వ సోవి యట్ కార్మికులూ, శాస్త్రజ్ఞులూ—చట్రానికి ఉక్కును తయారు చేసిన ఉరల్స్ లోహ నిర్మాతలు మొదలుకుని, స్వయంచలనక నియంత్రణకొరకు సున్నితమైన, క్లిష్టమైన ఎలెక్ట్రానిక్ ఆపరేటస్‌లో చివరి కాంటాక్టును తయారు చేసిన మనమెరగని ఎలెక్ట్రీషియన్ వరకూ—సృష్టించారని మనసారా భావించాము. దీనిలో, యీ నౌకలో మా యావత్తు పరిశ్రమ, విజ్ఞానశాస్త్రం, అభివృద్ధి చెందిన సాంకేతిక విద్య సాధించిన విజయాలు గూడుకట్టుకొని వున్నాయి.

"ఈ నౌక, నాకు అప్పగించబడవచ్చునేమో" అని అనుకున్నాను నాలో నేను.

భావి రోదసీ నౌకా చోదకులమైన మేము, మా కమ్యూనార్డ్ తాతల దేశమైన మా దేశంలో ప్రతిభావ్యుత్పత్తులు ఎంత పుష్కలంగా వున్నాయో పూర్తిగా ఆకళింపు చేసుకున్నాము.

ఆ నౌకను పరిచయం చేసుకున్నాక, మేము దానికి పరిశీలన జరప డం ప్రారంభించాము. మేము ప్రత్యేక స్థావరాలలో వుండగా, భూసంబం ధంగా మాకు శిక్షణ యివ్వబడింది, దాన్ని నడపడానికి. నౌక స్వయం చలనక సౌంజ్ఞలకు బదులు చెప్పడం లేదన్నట్టుగా, మా చోదకులు తరచు మాకు పరిస్థితులను కల్పించారు. మేము దానిని సరైన త్రోవలో వెంటనే తూచా తప్పకుండా నడపాలి; వెంట్రుకవాసి తప్పకుండా ప్రతి ఒక్కటీ పని చేసేటట్టుగా, నిర్ణీత స్థలంలో మేము నౌకను దింపగలిగేటట్టుగా బ్రేకింగ్ ఆపరేటస్‌ను తిప్పాలి.

ఆ రోజుల్లో మేము తరచు రోదసీ నౌకాశ్రయాల్లో డిజైనర్లనూ, కార్మికులనూ కలుసుకుని, ఏదో ఒక పరికరానికో, యూనిట్‌కో సంబంధించిన నిర్మాణాన్ని గురించో, స్థానం గురించో మాటాడే వాళ్ళం. ప్రధాన డిజైనర్ మేము చెప్పిన దానిని శ్రద్ధగా వినేవారు, మేము మళ్ళీ కర్మాగారానికి వచ్చినప్పుడు మేము కోరింది నౌకలో నిర్మింపబడి వుండడం తరచు మాకు కనిపించేది.

"మీరు దీన్లో ఎగరవలసి వుంది" అని ప్రధాన డిజైనర్ మళ్ళా అనేవారు.

మాలో ఆయనకు నమ్మకం వుందనీ, తన రోదసీ సంతానాన్ని తొలిసారిగా పరిక్షకు పెట్టే వాళ్ళగా మమ్ములను ఆయన పరిగణిస్తున్నారనీ మా కనిపించింది. ఆయనపట్ల మాకు రానురానూ గౌరవం హెచ్చడమే కాదు, నిజమైన బంధు ప్రేమ కూడా కలిగింది. రోజురోజుకూ ఆ నౌక మాకు ఎక్కువ పరిచయమయ్యింది; స్వయంచలనక యంత్ర సాధనాలు పని చేయకపోతే, మేమే ఆ నౌకను నడుపుకోగలమనీ, చక్కని డిజైనుతో వేగంగా నమ్మకంగా పోయే మిగ్ విమానాలలాగే అదీ మాకు లొంగి వుంటుందనీ మాకు పూర్తిగా నమ్మకం కలిగింది.

ప్రధాన డిజైనర్ తన నౌకను, పథకాలనూ మాకు పరిచయం చెయ్యడమే కాదు, మా శిక్షణా అభ్యాసాలగురించి ఎప్పుడూ ఆసక్తి కనబర్చేవారు, మేము ఏమనుకుంటున్నామో చెప్పమనేవారు, యాత్రకు ఎలా సన్నాహమవుతున్నామో చెప్పమనేవారు.

"స్నేహితులారా, చూడండి, గొప్ప వీరకృత్యాన్ని చేయడానికి సిద్ధంగా వున్నామని మీరు అనుకోవడం మొదలుపెట్టినట్టయితే, యాత్రకు యింకా మీరు సిద్ధంగా లేరన్నమాట" అన్నారాయన.

డాక్టర్లు పెద్ద ఉష్ణోగ్రతను పెట్టిన ఉష్ణ మందిరంలో మాకు చాలా యిబ్బందిగా వుందని, మాలో ఒకరు ఒకరోజు నవ్వుతూ ఫిర్యాదు చేశారు.

"సువొరోవ్‌ను జ్ఞాపకం పెట్టుకోండి", అన్నారు ప్రధాన డిజైనర్. "'శిక్షణలో కష్టపడితే, యుద్ధంలో సుళువవుతుంది.' విషయమేమిటంటే,

నౌక రోదసిలోనుండి భూమికి తిరిగివచ్చి, విపరీత వేగంతో వాతావరణపు దట్టమైన పొరలలో ప్రవేశించినప్పుడు, దాని పక్కలు అనేకవేల డిగ్రీలకు వేడెక్కిపోతాయి. వెలుపలనది, భూమి వేపుకు దూసుకవచ్చే అగ్నిగోళం. నౌకకు వేడినుండి రక్షణ వుంటుందని నాకు నమ్మకమే. అది కరగదు, కాలిపోదు, ఆ ఉష్ణోగ్రతను కాబిన్లోకి పంపదు. కాని రోదసీ నౌకా చోదకుడు దేనికైనా సరే సిద్ధంగా వుండాలి."

భయంకరమైన అగ్నిహోత్రం మధ్యను ఎగురుతూ వుంటామనీ, దానినుండి మిమ్మల్ని రక్షిస్తున్నదల్లా ఒక ప్రత్యేక పదార్థంతో చేసిన ఒక సన్నపాటి పొర మాత్రమేననీ ఆలోచించుకుంటే కంపర మెత్తుతుంది. మేము ఏమనుకుంటున్నదీ ప్రధాన డిజైనర్ గుర్తించినట్టున్నారు. ఒకరోజు నాయన మాకు, భూమికి చుట్టూరా కక్ష్యలో ఒకరోజల్లా ఎగిరి అప్పుడప్పుడే తిరిగి వచ్చిన ఒక రోదసీ నౌకను చూపెట్టారు, ఇప్పటివరకూ పైకి వెళ్ళని మా కొత్త నౌక లాగనే వుందది. పైని ఉష్ణ ఆచ్ఛాదనం మాత్రం కాస్తంత కరిగింది. కాని లోపల, ప్రారంభానికి ముందర వున్నట్టుగానే వుంది అంతా. సినీమా ఫిల్మ సైతం, తుపాకీ గుండలాగా చప్పున కాలిపోయే ఆ సెల్లులాస్ ముక్క కూడా అక్కడ చెక్కుచెదరకుండా వుంది. ఆ ఉష్ణ కవచం గట్టి దనీ, నమ్మకమైనదనీ యిది మాకు విశ్వాసం కలుగజేసింది.

మాలో మేమీ విషయాన్ని చర్చించుకున్నప్పుడు, యీ చిన్న పొర మా ఉజ్జ్వలమైన సాహసోపేతమైన విజ్ఞాన శాస్త్రపు చరిత్ర అంతటికీ కీల కంగా వుండగలదన్న భావం మాకు కలిగింది. నవ రష్యా, సోషలిస్టు రష్యా విజ్ఞాన శాస్త్రం. నలభై ఏళ్ళ క్రితంవరకూ కూడా మేము పురాతనపు గాలోషెస్ జోళ్ళను సైతం చేయలేక పోయేవాళ్ళం. కుట్టు యంత్రాలు సింగర్‌నుండి తెచ్చుకునేవాళ్ళం. ఇప్పుడు, బహుశా, రోదసినుండి మని షిని చెక్కుచెదరకుండా తిరిగీ రప్పించేందుకు, సోవియట్ విజ్ఞాన శాస్త్ర వేత్తలు మెండెలీవ్ టేబుల్‌లో నూటనలభై ఐదవ మూల వస్తువును కని పెట్టి, దానిని నూతన రోదసీ విజ్ఞానశాస్త్ర సేవకు నియోగించారు.

అంచేత, క్రమక్రమంగా మేము రోదసీ నౌక నిర్మాణం విషయంలో

సిద్ధహస్తులం కావడమే కాకుండా; ఉదాత్తమైన ఒక ఘన కార్యాన్ని చేయడం కోసం, మానవుని చిరవాంఛిత స్వప్నాల సాఫల్యం కొరకు శాంతి అభ్యుదయాలకోసం, సోవియట్ విజ్ఞాన శాస్త్ర మహత్తర విజయాన్ని కళ్లారా చూశాము కూడా.

1960 ఆగస్టు 19న బెల్కా, స్ట్రెల్కా రోదసిలోనికెళ్ళి, పద్దెనిమిది ప్రదక్షిణలు చేశాక, నిర్ణీత స్థలానికి కొద్ది కిలోమీటర్లు ఎడంగా మాత్రమే భూమికి భద్రంగా తిరిగి వచ్చాయి.

కాని యీ చతుష్పాద రోదసీ నౌకా యాత్రికుల యానాల విషయంలో అంతా సవ్యంగా జరిగిపోలేదు.

ఇది 1960 డిసెంబరు 1న జరిగింది. ఆ రోజున ప్చెల్కా, ముష్కాతో ఒక నౌక భూమికి చుట్టూరా కక్ష్యలో పెట్టబడింది. సరిగ్గా గణితాల ప్రకారం రాకెట్ పైకి వెళ్ళింది, యీ కుక్కలను భూమికి చాలా దూరంగా తీసుకవెళ్తూ. 108 నిమిషాల తరవాత వాట్ని మేము పలకరించగలమనుకున్నాము. కాని ఎక్కడో రోదసిలో ఆటోమేటిక్ బ్రేకింగ్, ఓరియంటేటింగ్ వ్యవస్థ సౌంజ్ఞలను స్వీకరించలేకపోయాయి; వాతావరణపు దట్టమైన పొరలలోకి వస్తుండగా నౌక కాలిపోయింది.

ప్రధాన డిజైనర్ ఎంతగా విచారించారో మేము గ్రహించాము. ఏదో నేరం చేసిన మనిషిలా ఆయన మా వేపు చూశారు. మాకు నిబ్బరం కలిగించడానికీ, ఓదార్చడానికీ, మమ్మల్ని కుదుటపర్చడానికి కూడా ప్రయత్నిస్తున్నట్టుగా కనిపించారు. ఇంతకీ మాలో ఒకరం పైకి వెళ్ళవలసి వుంది. బ్రహ్మాండమైన విశ్వ అన్వేషణా కార్యక్రమంలో అనుకోని ఘటనలు జరగకండా చెయ్యలేము; మేము ఒకొక్కరం ఒకొక్క విధంగా దీన్ని గురించి భావించాం.

"దిగులు పడవలసిన అగత్యం లేదు" అన్నారొక రోదసీ నౌకా చోదకుడు, చనువుగా అభిమానంగా ప్రధాన డిజైనర్ చేతిని ఊపుతూ. "పరీక్ష చేసిన విమానాలకు సైతం యిటువంటిది జరుగుతుంది. మాకేమీ కీడు జరగదు. స్వయం చలనక వ్యవస్థ చెడిపోతే, మేము దాన్ని చేతితో నడుపుతాము."

ప్రధాన డిజైనర్ కళ్ళు కళకళలాడేయి. ఆయన మా వేపు చిరునవ్వుతూ చూసి, నెమ్మదిగా "మీకు కృతజ్ఞుణ్ని" అని అన్నారు.

మనిషితో మొదటి రోదసీ నౌకను పంపవలసిన రోజు దగ్గరపడుతోంది. ప్రభుత్వ సంఘం మొదటి మనిషిని ఎంచింది...

"మనం చాలా మందిమి వున్నాము గోతిలో" అన్నారు పుష్కిన్. రోదసీ నౌకా చోదకులం కూడా చాలా మందిమి వున్నాం. మొదటి యాత్ర చేయడానికి ప్రతి ఒక్కరం సిద్ధంగా వున్నాం, వెనుక చూపు లేకుండా, రోదసిలో రాగల ప్రమాదానికి ముఖంలో వణుకులేకుండా. నాతో వున్న రోదసీ నౌకా చోదకులైన నా మిత్రుల గురించి, యిప్పుడు నేను కొంత చెప్పాలి.

సోవియట్ భూమి 18వ సంచికకు అనుబంధం, సెప్టెంబరు 1926

# అన్నిటికంటే, ప్రశాంతంగా వుండాలి

రోదసీ నౌకా చోదకుల దళంలోని వారంతా ఒకే రోజున ఎంచుకోబడ్డవారు కాదు. కొంత మంది ముందరా, కొంతమంది తరవాతా వచ్చారు.

మేము క్రమక్రమంగా ఒకరినొకరం తెలుసుకున్నాము. "వీళ్ళలో ఒకరితో ఒకరికి ఎంత తేడా వుందో!" అనిపించింది మొట్టమొదట నాకు.

నా కొత్త పనికి నేను వెళ్తోంటే, "నా కొత్త 'సహచరులు' ఎలా వుంటారో? నేను వారికి యీడవుతానా?" అని నన్ను నేను ప్రశ్నించుకోక తప్పలేదు.

మేమంతా కలిశాక, రాకెట్లమీద రోదసిలోకి యాత్రలు చెయ్యబోయే వారి గురించి నాకు అభిప్రాయాలు పూర్తిగా మారిపోయాయి. మేమంతా భిన్నమైన వాళ్ళం. మేమంతా కలసి వుండగా చూసిన ప్రతి ఒక్కరికీ కలిగిన తొలి అభిప్రాయమూ, సరైన అభిప్రాయమూ యిదే. అన్ని రోజులు ఒకచోటే కలసి వుండి, కలసి తర్ఫీదయి, కలసి చదివి, యానాలకు కలసి సన్నాహం అయినప్పటికీ రోదసీ నౌకా చోదకులకూ యిదే వర్తిస్తుంది.

వయసులోనే కాదు, ప్రమాణంలో, బాహ్య రూపంలో మాకు తేడాలున్నాయి. మా జీవితానుభవంలోనూ, నడవడిలోనూ, మా వ్యక్తిగత అభిరుచుల్లోనూ, జీవిత చరిత్రల్లో కూడా మేము భిన్నులం.

గట్టి ఆరోగ్యం, మంచి దృఢ శరీరం, అన్నిటికీ సంసిద్ధత, కొత్త రకపు పనిలో ఆసక్తి—లక్షలాదిమంది యితర సోవియట్ యువజనులకూ, మాకూ యివి తేడాను కలిగిస్తున్నాయా? దక్షిణ ధృవ యాత్రకూ, కదలిపోయే మంచు గడ్డలపైకి యాత్రకు వెళ్ళడానికీ, కొత్త విమానాల్ని పరిక్షించడానికీ సన్నాహ శిక్షణను యివ్వడానికి యిటువంటిదే ఒక దళాన్ని ఏర్పాటు చెయ్యవచ్చును. మా దళం ఒక జలాంతర్గామి జట్టు అవొచ్చును,

ఒక జల విద్యుత్కేంద్రపు పై ఎత్తు నిర్మాణాలను చేసే జట్టు కావొచ్చు. ఒక్క మాటలో చెప్పాలంటే మనోదీక్ష, శరీర దార్ఢ్యం, జ్ఞానం, మా సమిష్టి ఆశయం పట్ల భక్తి అవసరమయిన ఏ పనికయినా అది సిద్ధమే.

దళంలో మా తొలి రోజులూ, క్రీడల్లో మా మొదటి పోటీలూ, మాలో ఒకొక్కరి వ్యక్తిత్వాన్ని మరీ స్పష్టం చేశాయి, శారీరక శిక్షణ అంతమందికీ ఒకటే అయినా.

బాస్కెట్ బాల్ ఆట స్థలంలో శిక్షకుడు ఆట మొదలు పెట్టాలని ఈల వేశాడు. నాకు యింతకు ముందర బాస్కెట్ బాల్ ఆటంటే ఆసక్తి లేదు. పక్క గీతలకు అవతలే వుండిపోవడానికి ప్రయత్నించేవాణ్ని, తెల్ల గీతలతో గుర్తులు వేసివున్న చిన్న ఆట స్థలంలో నా తోడివారు గాభరాగా గుమిగూడి వున్నట్టు నాకు కనిపించే ఆ ఆటను పట్టించుకోకుండా చూస్తూ.

కాని తొలి నిమిషాల్లోనే ఒకతను తనకంటె పొడవుగా, దృఢంగా వున్న ప్రత్యర్థుల్ని సులువుగా ఓడించేవాడు. ఆయన త్వరలోనే ఆ జట్టుకు కేప్టెన్ అయ్యారు. ఆట స్థలంలో "బాగుంది, యూరా ! మళ్ళీ గగారిన్ ! ఇంకోసారి !" అన్న కేకలు వినిపించేవి.

యూరీ ఆటకు మీరు యీర్ష్య పడవచ్చును. నేను ఆటను బాగా గమనించడానికి అప్రయత్నంగా మొదలుపెట్టాను, నాకూ దాన్లో ఆసక్తి పుట్టింది. ఇప్పుడు నేను బాస్కెట్ బాల్‌ను పట్టుదలగా ఆడే ఆటగాణ్ని, యీ ఆట క్రీడల్లో ఉత్తమమైన వాట్లో ఒకటని అనుకుంటున్నాను.

మా సహచరుల్లో యింకో ఆయనకు బాస్కెట్ బాల్ ఆట విషయంలో ఏమీ చేతకాదు. కాని వెయిట్ లిఫ్టర్‌గా ఆయన మాకంటె చాలా గట్టి మనిషి.

మా నడతలలో, ఆసక్తుల్లో, అలవాట్లలో ప్రత్యేకతలు అన్నిట్లోనూ కనిపిస్తాయి. కాని తీవ్రమైన అధ్యయనం, శిక్షణ గడిచేక మా అందర్లోనూ ఒక సమాన గుణం కనిపించింది. మా కొత్త వృత్తి పట్ల దృఢమైన దీక్ష, తెలియని రోదసిలోకి ఎగిరి వెళ్ళడానికి సంసిద్ధతా అది.

ఒకర్నొకరం బాగా ఎరిగి వున్న మేమంతా గట్టిగా యిలా చెప్పగల

మనడానికి నేను జంకను: మూడో వ్యక్తి, నాలుగో వ్యక్తి, పదిహేనో వ్యక్తీ, మాలో ఎవరేనా సరే రాకెట్‌లో వెళ్ళడానికి సిద్ధమే. ప్రతి ఒక్కరమూ ఆ రోజుకోసం ఆతృతగా చూస్తున్నాం.

మా దళం ఒకే రోజున ఏర్పడలేదు, సహజమే. ఒకే ఆశయం కోసం, ఒకే లక్ష్యాలకోసం అఖండమైన, ఐక్యమైన సమిష్టి సంస్థగా ఒక్క-సారిగా రూపొందనూ లేదు. మాలో కొందరం విమర్శకు కాస్త నొప్పిపడి దిగజారేవాళ్ళం, తక్కిన వాళ్ళకు మరీ కోపంవచ్చేది. ఇంకొంతమంది ఉత్సాహాన్నీ, కమ్మని హాస్యాన్నీ దళంలో పోసేవారు. కాలం గడుస్తున్నకొద్దీ ఒకొక్కళ్ళం మా మిత్రులలోని ఉత్తమ గుణాల్ని స్వీకరించే వాళ్ళం. ఇప్పుడు, ముందర చిన్న వేళాకోళానికి కోపం తెచ్చుకునే మనిషి, యింకొకతనిని ఎంతగా పరాచికాలాడుతాడంటే, యీ మనిషి యీ రకంగా ఎలా తయారయ్యాడా అని ఆశ్చర్యం వేస్తుంది. విషాద రూపంలో వుండే ఒక స్నేహితుడికి ఆ చిరునవ్వు ఎక్కణ్నుంచి వచ్చింది చెప్మా?

మా దళం దాని నియమాలను అదే ఏర్పరచుకుంది కూడా, అలిఖిత సూత్రాల వంటివాటిని. మా వ్యాయామాలలో పూర్తి శ్రద్ధ, అనవసరపు మాట ఒక్కటీ వుండకూడదు. ఏ ఒకరూ యింకొకర్ని పనికి భంగం కలిగించకూడదు. ప్రతి ఒకరూ తక్కినవాళ్ళ సాంకేతిక విద్యలోనూ, సిద్ధాంతంలోనూ సిద్ధహస్తులు గావటానికి తోడ్పడుతారు, క్రీడల్లో ప్రావీణ్యాన్ని పెంచుకోవడానికి సాయపడతారు. కాని పని ముగిస్తే, ఎవరిమట్టుకు వారు పరిశీలన జరుపుకోవాలి. ఇక విమర్శలు వచ్చిపడతాయి : బోధకునికి చెప్పిన తప్పు జవాబు, శిక్షణలో అసహ్యమైన భంగిమం. లేకపోతే వాళ్ళు వేళాకోళాలాడుతూ మీ చుట్టూరా తిరుగుతారు, మీ స్నేహితుల ఉల్లాసానికి మీరు కూడా వశులైపోయేటట్టుగా, మీ భ్రమకూ, మీ అశ్రద్ధకూ మీరే నవ్వుకునేటట్టుగా.

వ్యాయామాలూ, శిక్షణా అయిపోయేక, నేను తరచు తమారాతో బాటుగా నాటకాలకు వెళ్ళేవాణ్ని, నాటకాలంటే సరదాపడే ఒక రోదసీ నౌకా చోదకుడూ మాతోబాటు వచ్చేవాడు. నాకు యింతకు ముందరా నాటకా

లంటే యిష్టమే. కాని యిప్పుడు నా స్నేహితుని ప్రభావంవల్ల, నేను నాటకాలను బాగా అర్థం చేసుకోగలుగుతున్నాను, మెచ్చుకోగలుగుతున్నాను, వాటిని వంటబట్టించుకుంటున్నాను.

త్వరలోనే రంగస్థలం, జీవితానికి మానవకృత్యాలకూ ఎక్కువ సార్థకతగల ప్రపంచానికి కిటికీగా పరిణమించింది మాకు. మేము చాలా నాటకాలు చూశాం, ఒక మాదిరీగా వున్నవీ, మంచివీ. కాని మలే నాటకశాలలోని లెవ్ టాల్‌స్టాయ్ "అంధకార బలిమి", మయకొవస్కీ నాటకశాలలోని అర్బుజోవ్ "ఇర్కుత్‌స్క్ కథ" వంటివి చాలకాలం జ్ఞాపకం వుండిపోతాయి.

సంగీత నాటకాలకూ మేము తరచు వెళ్ళేవాళ్ళం. నా అభిమాన సంగీత నాటకం "రుస్లాన్, లుద్మిల్లా" నాకు ప్రేమాస్పదమైనది. అది నాకు బాల్యంనుండి తెలిసివుండడంవల్ల కావొచ్చు, యిక్కడా అక్కడా మా నాన్నగారు వాయించే దాని స్వరాలు మా యింట్లో విలువైనవిగా వుండిపోతాయి

నా స్నేహితులూ, నేనూ మాస్కో అంతటా, దాని పరిసరాల్లోనూ తిరిగాం. జాతీయార్థిక విజయాల ప్రదర్శనకు వెళ్ళడం నాకిష్టం. మేము ప్రదర్శనకు వెళ్ళినప్పుడు తమారా ఎప్పుడూ మాతో వుండేది. అప్పుడప్పుడు కాళ్ళు పీకేవి, అప్పుడు కూచొని ష్రింప్స్‌తో బీరు తెప్పించుకుని, విశ్రాంతి తీసుకునేవాళ్ళం.

మా రోదసీ నౌకా చోదకులైన స్నేహితులు, మా అబ్బాయి చనిపోయినప్పటి కష్టపురోజుల్లో నాకూ, తమారాకూ నిజమైన స్నేహితులు అయ్యారు. విచారమూ, బాహ్యమైన సానుభూతీ కాదు, వాళ్ళు నాకు గట్టి అండగా కనిపించారు.

ప్రకృతిపట్ల ప్రేమ, మా ప్రాంతాలపట్ల అభిమానమూ మమ్మల్ని ఏకం చేసింది. మేము ఎక్కడున్నాసరే, ఏదోవిధంగా మా ప్రాంతాలను జ్ఞాపకంచేసే స్థలాలు మాకెప్పుడూ కనిపించేవి.

మాస్కోకు చుట్టూరావున్న ప్రదేశం నా కిష్టం, ముఖ్యంగా ఆల్తాయ్

లాగా వున్న తావులు. కకాసస్ అంటే నాకభిమానం, యిది కూడా ఏదో విధంగా మా ప్రాంతాన్ని నాకు జ్ఞాపకం తెస్తుంది గాబట్టి.

మేమంతా మామూలు మనుష్యులం, అదే మమ్మల్ని ఐక్యం చేసింది కూడా. "రోదసిలో ఎగరడానికి మీరింత ఆతృత పడుతున్నారే, దానికి కారణం ఏమిటి ?" అని ఒక పత్రికా రచయిత అడిగిన ప్రశ్నకు నేనిచ్చిన జవాబుకు, రోదసీ నౌకా చోదకులైన నా మిత్రులు ఏ ఒక్కరైనా ఒప్పుకుంటారనుకుంటాను.

"భూమి మీద వున్న ప్రతి ఒక్కదాన్ని నేను ఎంతో నిజంగా, గాఢముగా ప్రేమిస్తున్నాను గాబట్టి అనుకుంటాను"అని నేను జవాబు యిచ్చాను.

మేము అనేక రిజిమెంట్ల నుండీ, స్క్వాడ్రన్ల నుండీ వచ్చాం— ఓల్గా ప్రాంతానికీ, స్టెప్పీలకూ చెందిన వాళ్ళూ, సైబీరియన్‌లూ, రాజధానీ వాసులు, మా పెద్ద సోవియట్ భూమిలోని రాష్ట్ర నగరాలకూ, గ్రామాలకూ చెందినవాళ్ళు, కమ్యూనిస్టులు, యువ కమ్యూనిస్టు సంఘ అభ్యర్థులూ, కార్మిక కర్షకుల బిడ్డలూ, గ్రామ, నగర బుద్ధిజీవుల బిడ్డలూ వున్నారు మాలో.

యుద్ధం ముగిసేసరికి తలిదండ్రులను కోల్పోయి ఒక బాల సదనంలో పెరిగిన ఒకరు వున్నారు కూడా మాలో. వ్యవసాయంలోనూ, ఫాక్టరీలలోనూ పనిచేసీ, విశ్వవిద్యాలయాల్లోనూ, ఇంజినీరింగు పాఠశాలల్లోనూ చదివీ, విమానయానానికి వెళ్ళడానికి ముందర గట్టి జీవితానుభవాన్ని పొందినవారూ వున్నారు వారిలో. కాని ప్రతి ఒక్కరమూ బాల సంఘం క్లబ్బులకూ, సోవియట్ పాఠశాలలకూ, వైమానిక పరిషత్తులకు, స్క్వాడ్రన్లకూ, యువ కమ్యూనిస్టు సంఘాలకూ వెళ్ళాం.

రోదసీ నౌకా చోదకునికి తప్పనిసరిగా వుండవలసింది, నిశ్చలంగా తొణకకుండా వుండడం, క్లిష్టమైన రోదసీ యాన సమయంలో వచ్చే ఏ పరిస్థితిలోనైనా. అందరూ యీ గుణాన్ని అలవర్చుకోవడానికి ప్రయత్నించారు, కాని రోదసీ నౌకా చోదకునికి వుండవలసిన యీ గుణం నాకు ప్రత్యామ్నాయ అభ్యర్థిగావున్న ఒకతని స్వభావంలో మూర్తీభవించినట్లుగా కనిపిస్తోంది నాకు.

ఆయన అనుభవంగల వైమానికుడు, ఒకసారి శిక్షణాయానం సమయంలో రాత్రిపూట ఒక జెట్ ఫైటర్ విమానాన్ని ఆయన బలవంతంగా నేలకు దించవలసి వచ్చింది. వైమానికులు అనేటట్టుగా ఆయన "పొట్ట మీద దిగువకు వచ్చారు." ఆయన దెబ్బలేవీ లేకుండా ప్రాణాలతో వచ్చారు, విమానాన్ని కాపాడారు.

"మీరిదెలా చేశారు?" అని మేమాయనను అడిగాము, ఆయన విమానయాన కాలంలో యీ ఘటన జరిగిందని మేము విన్నప్పుడు. "మీకు సాయపడిందేది?" అనడిగాము. "అన్నిటికంటె ప్రశాంతత" అని ఆయన సుళువుగా జవాబు చెప్పేశారు.

"ఈయన మాటాడడు" అని మేము నిర్ణయించుకున్నాము. అయితే ప్రాయోగిక వ్యాయామాలు మొదలైనప్పటికి మాకు నమ్మకం కలిగింది. దర్పం చూపడంగాని, డంభాలు పలకడంగాని కలలోగాని చేసే మనిషి కాదు మా స్నేహితుడు.

"రోదసిలో ఎగురుతున్నప్పుడు యీ నియంత్రణా వ్యవస్థ చెడితే ఏం చేస్తారు మీరు?" అని పరిక్షచేసే ఆయన అడిగారు, ఒక మరీ ముఖ్యమైన యంత్ర విభాగం బొమ్మను చూపుతూ.

"అన్నిటికంటే, ప్రశాంతత."

మాలో ఒకరం వెటకారంగా ఈల కూడా వేశాం.

పరిక్షచేసే ఆయనకు చికాకెత్తినట్టుగా వుంది, ఆయనకు కావలసింది సరైన జవాబు గాబట్టి ఆయనకు కోపం వచ్చేటట్టుగా కూడా వుంది.

"సరే, యిది చెడిపోతే?" అని మా బోధకుడు మళ్ళీ అడిగి, శరీరం అంతట్నీ ముందుకు వంచారు.

ఏమీ కష్టపడకుండా జవాబు వచ్చింది మళ్ళీ: "అన్నిటికంటే, ప్రశాంతత."

తరవాత ఆ రోదసీ నౌకా చోదకుడు, అటువంటి పరిస్థితిలో తానేమి చేస్తాడో సవివరంగా చెప్పారు.

ఇంకో మా స్నేహితునికి గట్టి మనోబలం వుంది. ఆయన విద్యా

వంతుడు, బాగా చదివారాయన, తనకు తెలిసిన దాన్ని ఎవరికైనా సంతోషంగా చెపతారు, దేన్నిగురించైనా మీకు కావలసింది ఆయన్నడిగితే చాలు.

రోదసీ నౌకా చోదకులైన నా స్నేహితుల గురించి నేనిలా చెప్పుకపోగలను. కాని పత్రిక రచయితలూ, రచయితలూ సమయం వచ్చినప్పుడు నాకంటె బాగా, సమగ్రంగా చెప్పగలుగుతారు. నేను కోరేదల్లా మేమంతా చాలా భిన్నభిన్నమైన వారిమనీ, అయితే చాలా సామాన్యులమైన సోవియట్ యువకులమనీ పాఠకులు గ్రహించాలనే.

కొత్త రోదసీ అన్వేషకుల పేర్లను ప్రపంచం తెలుసుకుంటుంది. మొదటి రోదసీ నౌకల డిజైనర్ల పేర్లు కూడా ప్రపంచ ఖ్యాతిని పొందుతాయి.

రోదసీ యానానికి తీవ్రమైన శిక్షణను పొందడం కోసం ప్రశాంతత ఎంతో అవసరంగాబట్టి, రోదసీ నౌకా చోదకులైన నా స్నేహితుల పేర్లను నేను యివ్వడం లేదు.

వాళ్ళ పేర్లే తెలిస్తే పత్రికా రచయితలు వాళ్ళను ప్రశాంతంగా వుండనిస్తారా? ఆ కారణం వల్లనే మూడవ రోదసీ నౌకా చోదకుని పేరు నేను యివ్వడం లేదు. ప్రపంచం ఆ పేరు తరవాత వింటుంది.

అన్నిటికంటే, ప్రశాంతత! మాలో ఎవళ్ళం ఎంచుకోబడతామో తెలియకుండా, నక్షత్ర లోకానికి మొదటి యాత్ర కొరకు మేమంతా ఎటువంటి ప్రశాంతతతో వేచివున్నామో అటువంటి ప్రశాంతతే.

దళంలోని నా స్నేహితుడు యూరీ గగారిన్ ఎంచుకోబడ్డారు. తన జీవితాన్ని గౌరవంగా, నిస్వార్థంగా గడపడానికి అభిలషించే ఎవరికైనా; తన దేశానికీ, విజ్ఞాన శాస్త్రానికీ, ప్రజలకూ సేవ చేయాలని అభిలషించే ఎవరికైనా ఉత్తమమైన ఉదాహరణంగా, నమూనాగా ఎవరి దీక్షా శక్తులైతే వున్నాయో అటువంటి మనిషిని ఆ సంఘం ఎంచింది.

ఆయన జీవిత కథకూ, వృత్తికీ కొంత సార్థకతవుంది. మా దేశపు జీవిత కథలో ఒక శకలం అది. ఆయన ఒక రైతుబిడ్డ, ఫాసిస్టు ఆక్రమణ కాలంలోని భయంకర పరిస్థితులలో ఆయన జీవించారు. తరవాత ఆయన ఒక చేతిపనివాడు, ఒక కార్మికుడు, ఒక విద్యార్థి, ఒక విమానయాన

సంఘంలో సభ్యుడు, ఒక వైమానికుడు. యూరీ సమకాలీకులు వేనవేల మంది యిటువంటి బాటనే నడిచారు. మా తరంవాళ్ళు విమానయానంలో పాల్గొన్నా, నౌకాయానంలో పాల్గొన్నా, విజ్ఞాన శాస్త్రంలోనో, లేకపోతే సైబీరియాలోనూ, దూర ప్రాచ్యంలోనూ వున్న బ్రహ్మాండమైన పంచవర్ష ప్రణాలికా నిర్మాణాల్లో పాల్గొన్నా అనుసరించే దారే యిది. వీట్లలో, ప్రధాన డిజైనర్, ప్రధాన సిద్ధాంత కర్త కార్యాలయాలలో లాగనే సరిగ్గా, రోదసిలో మానవుని తొలి యాత్ర కవసరమైన పరిస్థిలు కల్పింపబడ్డాయి.

యూరీకి ప్రత్యామ్నాయ అభ్యర్థిగా నేను నియమింపబడ్డాను.

1961 ఏప్రిల్ 12న యూరీ, నేనూ రోదసీ నౌకాశ్రయానికి వెళ్ళాం. ఓస్తోక్-1 ని పంపడానికి ముప్పయి నిమిషాలు ముందర, నేను నా శిరస్త్రాణాన్నీ, వైమానిక దుస్తుల్నీ తీసివేసి, రోదసిలోనికి ప్రథమ మానవ యాత్రను చూడడానికి రోదసీ నౌకా చోదకులైన నా మిత్రులతో బాటుగా, రోదసీ నౌకపైకి వెళ్ళేచోటికి మూడు కిలోమీటర్లు ఆవలికి వెళ్ళాను.

దీని మొదటిపుటల్లో, నిజంగా చరిత్రాత్మకమైన యీ ఘడియగురించి నా భావాలనూ, ఆలోచనలనూ చెప్పడానికి ప్రయత్నించాను.

# పదిహేడు రోదసీ ప్రభాతాలు

నాలుగు మాసాలు మాత్రమే గడిచాయి, మళ్ళీ ఆకుపచ్చటి బస్సు రోదసీ నౌక బయలుదేరేచోటికి వెళ్ళింది.

చిన్న తలుపులు బిగువుగా మూసి వెయ్యబడ్డాయి, ఎక్కడో ఒక ఎలెక్ట్రిక్ మోటారు పనిచేస్తూ వుండడం వినిపించీ వినిపించకుండా వుంది. ఎలివేటర్ మిగిలివున్నవారిని దించివేస్తోంది.

కొద్ది నిమిషాల్లో అసెంబ్లింగ్ గడ్డర్లు తీసివేయబడడం నాకు వినిపించింది.

రోదసీ నౌకాశ్రయంలో వున్నంత నిశ్శబ్దంగా నా రాకెట్‌లోనూ వున్న దనిపించింది, మిడతలు స్టెప్పీ అంతటా కిచకిచమంటూ వుంటాయను కున్నాను.

మైక్రోఫోన్లో ప్రధాన డిజైనర్ "ఎలా వున్నారు ?" అని అడిగారు.

"బాగున్నాను !"

అయితే నేనెలా వున్నానో వారెరుగుదురు : డాక్టర్లు జాగ్రత్తగా పరికరాల మీద వున్నవాటిని పరిశీలిస్తున్నారు, నా హృదయ స్పందనాన్ని వింటున్నారు, నా రక్తపు పోటును తెలుసుకుంటున్నారు. నేను నా గురించి అడిగేదానిని విని, అప్రయత్నంగా మళ్ళీమళ్ళీ "బాగున్నా"నని అంటున్నారు.

"పరిస్థితులన్నీ బాగున్నాయా, గెరా ?" ఇదడిగిన వాళ్ళు నా స్నేహితులు. వాళ్ళు హాస్యాలాడుతున్నారు, నవ్వుతున్నారు, ఒక్క మాటలో చెప్పాలంటే సంతోషంగా వున్నారు.

"ఏదేనా సంగీతం పెట్టేదా ?" అనడిగారొకరు. "ఏది వినాలనుంది నీకు !"

"నీ యిష్టం వచ్చింది పెట్టు."

తరవాత, "నిన్ను నేను ప్రేమిస్తున్నాను, జీవితమా" అన్న పాటను విన్నాను. ఆ తరవాత "రాకెట్ల మందల్లో నాకు నమ్మకం వుంది, మిత్రులారా" అన్న రోదసీ నౌకా చోదకుల అభిమాన గీతం.

ఆపండి ! సంగీతం ఆగిపోయింది. గొంతుకలు ఆగిపోయాయి. తొలి ఆజ్ఞ యివ్వబడింది. ఇప్పుడెలా వున్నానని డాక్టరు అడుగుతున్నారు, అయితే యిది లాంఛన ప్రాయంగానే. ఆయన గొంతునుబట్టి నాకు తెలుసు నేను బాగున్నట్టు ఆయనకు తెలుసునని.

నేను నా వాచీ చూసుకున్నాను. ఎగురవేతకు కొద్ది నిమిషాలుంది. కేబిన్‌లో కలయజూసేను మళ్ళీ. ఇప్పుడిది నా యిల్లు, నా దుర్గం. నాకిప్పుడెలా వుంది ? భయమా ?

నాకు జ్ఞానం వచ్చాక జీవితం అంతట్లో, మొదట్లో పారచూట్లతో గంతుతూ వున్నప్పుడూ, తీవ్రతలనబడేవాటిని ఎదుర్కొనేటప్పుడూ, భయం అన్న యీ భావాన్ని నేను అనుభవించలేదు. ఎంచేతనంటే నేనే పనైతే చేస్తానో ఆ పని గురించి నేనెప్పుడూ తెలుసుకుంటాను, ఎటువంటి పరిస్థితులకైనా నేను అంతర్గతంగా సిద్ధపడి వుంటాను.

ఇప్పటివరకూ నేనేమైతే చేశానో అదల్లా దానంతటదే జరిగింది; విధి పట్ల స్పష్టమైన భావాలకూ, వెనక పడకూడదన్న పరిశుద్ధమైన వాంఛలకూ సవ్యమైన ఫలితమే. అవసరం, అలవాటు, చేతిలో వున్న పని ప్రయోజనాలకు, సమిష్టి ప్రయోజనాలకు వ్యక్తి ప్రయోజనాలను లోబర్చవలసిన అగత్యం వచ్చాయి.

నేను దీన్ని గురించి ఆలోచించాను అర్ధ చైతన్యంలో, నా బాల్యంలోనూ, బాల సంఘం క్లబ్బులో నేను తైమూర్ బృందంలో చేరినప్పుడూ. కలసి వుండే ప్రజలతో చెలిమికి అర్ధం ఏమిటో తెలుసుకోవడానికి నాకు తోడ్పడిన యువ కమ్యూనిస్టు సంఘానికి నేను దరఖాస్తు పెట్టినప్పుడు, నేను దీన్ని గురించి ఆలోచించాను. పై తరగతులలో వున్నప్పుడే యువ కమ్యూనిస్టు సంఘం సమితిలో నేను సభ్యుణ్ణనీ, గోడ వార్తా పత్రికకు బాధ్యత

వహించాననీ నాకు జ్ఞాపకం వుంది. సమితికి ఎన్నికలు జరిగాయి, కొందరు నన్ను విమర్శించడం మొదలుపెట్టారు, వాస్తవానికి దుమ్ము రేగిపోయింది.

సరే, యువజన నాయకునిగా నాకిదంతా జరిగించనుకున్నాను. కొత్త సమితికి అభ్యర్థుల పేర్లు ప్రతిపాదించడం మొదలు పెట్టారు. "తి తో ప్" అన్న పేరు విన్నాను.

"ఏమిటర్రా యిది ?" అనడిగేను కోపంగా. "మీరు నన్ను పూర్తిగా తూర్పారబట్టారు. మళ్ళీ యిప్పుడిదా ?"

"మేము నిన్నెందుకు విమర్శించామో ఎరుగుదువా ?"

"సరే ఏమిటది ?" అని గొణిగాను.

"పని ఎలా చెయ్యాలో అలా యికమీదట నువ్వు పని చేస్తావు... తితోవ్ !" అంటూ వాళ్ళు హర్షధ్వానాలు చేశారు. అంచేత నేను మళ్ళీ సభ్యుణ్ని.

యువ కమ్యూనిస్టు సంఘం నాకెంతో మేలు చేసింది, అతిగాపోయే నా స్వభావానికి అది కొన్ని "దిద్దుబాట్లు" యిచ్చింది—నా మంచికోసమే.

చివరికి కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వానికి నేను అభ్యర్థినయ్యాను. ఇది నా జీవితానికీ, ఆలోచనలకూ, వాంఛలకూ పరాకాష్ఠ స్థితి అయ్యింది. ఏ కష్టమైన పనినైనా చేయడానికీ, ఏ ప్రమాదాన్నయినా ఎదుర్కోవడానికీ మొట్టమొదట పూనుకునే నా దేశీయుల శ్రేణులలో చేరాన్నేను, కమ్యూనిస్టు పార్టీలో ప్రవేశిస్తూ.

నా మనోనేత్రం ఎదుట ముఖాలూ, దృశ్యాలూ అవుపిస్తున్నాయి. నేను చూడని వాళ్ళున్నారు, కానయితే వారి పనిని గురించి నేనెరుగుదును. జీవితాన్ని చాలించిన వాళ్ళున్నారు వాళ్ళలో, యిప్పుడు జీవిస్తూ ఆరోగ్యంగా వున్నవాళ్ళున్నారు. మా నాన్నగారు, బాల సదనంలోని ఆ లెనిన్‌గ్రాడ్ అమ్మాయి లోరా, వైమానిక శిక్షణ నిచ్చిన బోధకులు, మరణించిన నా స్నేహితుడు ల్యోషా కోవల్, ప్రధాన డిజైనర్, యూరీ గగారిన్, రోదసీ నౌకా చోదకులైన నా మిత్రులు, మంచులో కూరుకపోయిన నన్ను బయటికి లాగిన అమ్మాయి గాల్కా, తమారా. ముఖాలకూ, ఆకారాలకూ ఏవిధమైన

సంబంధమూ లేని పలుపుడు. రెండో పిలుపుకు వీళ్ళంతా నాతోబాటు కాచుకుని వుంటారు, ఉచితమైన నా పనికోసం కాచుకుని వుంటారు. ఆ క్షణంలో నికితా సెర్గియేవిచ్ కృశ్చేవ్ ఏమి చేస్తున్నారో నాకు తెలియదు. కాని ఆయనకూడా తన గడియారాన్ని చూసుకుంటూ "మన రోదసీ నౌకా చోదకుడు అక్కడెలా వున్నా"డని అడుగుతున్నాడనిపిస్తోంది నాకు.

నేను మళ్ళీ పరికరాల్నీ, నియంత్రణల్నీ చూసుకున్నాను. ప్రతి ఒక్కటీ దేని స్థానంలో అది వుంది. పనుల క్రమం గురించి ఆలోచించుకున్నాను. చివరి ఆజ్ఞ యిప్పుడు యివ్వబడుతోంది. కుర్చీలో మరింత సదుపాయంగా వుండడానికి ప్రయత్నించాను, కండరాల్ని విశ్రాంతిగా పెట్టుకున్నాను, కుర్చీ వెనకకు నా తలను గట్టిగా ఆన్చేను. ఒక్క సెకండు మాత్రం వుంది.

"పంపండి !"

హెచ్చుతోన్న ఇంజన్ల రొద మొదలయ్యింది, చట్రం కంపించింది. "పొలంలో మిడత బహుశా నిశ్శబ్దంగా వుండి వుంటుంది" అన్న ఆలోచన నా తలగుండా వెళ్ళింది.

"వెళ్ళిందిరా బాబూ !"

నేను కుర్చీకు అంటుపెట్టుకుని వున్నాను. చిన్న కుదుపు, రాకెట్ తొలి దశ పనిచేస్తూ వుంది. రెండోది. మూడోది. ఒత్తిళ్ళు వెళ్ళిపోయాయి, అయిష్టంగా వెళ్ళినట్టు; హటాత్తుగా చీమైనా చిటుకుమనని నిశ్శబ్దం.

నేను రోదసిలో వున్నాను !

హటాత్తుగా పరికరాల పానెల్ యీదుకుంటూ ఎక్కడికో వెళ్ళిపోయింది. భూమి ఎక్కడుందో గమనించలేక పోయాను. నేను ఏ స్థితిలో వున్నానో తెలియదు. కాని కొద్ది నిమిషాల్లో దేని స్థానంలో అది వుంది. రోదసి యిచ్చే తొలి బహుమానం నాకు లభించింది—భార రాహిత్యం. ఇక పనికి.

కంతలోనికి క్రీగంట చూశాను. తళతళలాడే రకరకాల రంగులు వింతయినవీ, చూపడానికి వీలులేనివీ. దృశ్యాలను మెచ్చుకోవడానికి సమయం లేదు—భూమినుండి అప్పుడే ఢోగట్టాలడుగుతున్నారు. రోదసీ నౌకా చోదకుని పని మొదలయ్యింది.

ఓస్తోక్–2 యాత్ర గురించి సాధికార ప్రకటనలంతమందికీ తెలుసు. జీవిత మంతా నాకు జ్ఞాపకం వుండిపోయే ఆ నిమిషాల గురించి మాత్రమే నేను చెపుతాను. ఇంకా కొత్త యాత్ర, కొత్త భావాలు సైతం నా జ్ఞాపకం నుండి వీటిని తుడిచిపెట్ట లేవు.

ఈ నిమిషాలు వచ్చాయి, యాత్రా కార్యక్రమాన్ని జరుపుతూ నేను నౌకను నడిపినప్పుడు. నేను ఆందోళనగా చక్రాన్ని పట్టుకున్నాను, మొదట అతి జాగ్రత్తగా, తరవాత బలంగా. రోదసీ నౌక వినయ విధేయతలతో తన గమనాన్ని మార్చుకుంది, ఒక స్థానంనుండి యింకో స్థానానికి సాఫీగా వెళ్ళింది. వైమానికులనేటట్టుగా "చక్రాన్ని పట్టుకుంటే" చాలు, అది యితర గ్రహాలకు వెళ్ళిపోయిందనిపించింది నాకు. ఈ భావనను యింకోదానితో పోల్చడానికి వీల్లేదు. విజ్ఞానశాస్త్రజ్ఞులపట్ల, మా విజ్ఞాన శాస్త్రంపట్ల గర్వం కలిగిస్తుందిది, మానవుని హేతుబుద్ధిలో గర్వాన్ని కలిగిస్తుందిది.

భూమిమీదనున్న వారు నా మాటల్ని బాగా వింటున్నారనీ, అర్థం చేసుకుంటున్నారనీ నాకు నమ్మకం కలిగేక, ఆ నౌక యాత్ర జయప్రదంగా సాగుతూవున్నదనీ, వ్యవస్థలన్నీ మామూలుగా పని చేస్తున్నాయనీ, నా మనస్సు స్థితి బాగున్నదనీ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీకీ, ప్రభుత్వానికీ, నికితా సెర్గియేవిచ్ కృశ్చేవ్‌కూ నివేదించాను. సోవియట్ ప్రజలందరికీ ప్రేమపూర్వకమైన అభినందనలను అందజేయమని కోరాను.

ఇంచుమించు వెంటనే భూమిపైనుండి నాకు, యువ కమ్యూనిస్టునైన నాకు నికితా సెర్గియేవిచ్ కృశ్చేవ్ నుండి ప్రేమపూర్వకమైన అభినందన పంపబడింది. నాకెంతో సంతోషం కలిగింది. మా దేశం యావత్తూ, యావత్తు ప్రపంచమూ నా యాత్రను గురించి తెలుసుకుని, దానిని గమనిస్తూ

వుందనిపించింది. ఇంకోసారి, మరీ గాఢంగా, యాత్రా కార్యక్రమాన్ని సరిగ్గా నిర్వర్తించే విషయంలో మా ప్రజలందరిపట్ల, యిరవైకోట్ల ప్రజల పట్ల నేను నాకు గల బాధ్యతను గ్రహించాను.

కారులో ఒక సొరంగం గుండా వెళ్తే చీకటి వచ్చేలాగా రాత్రి ముంచుక వస్తుంది. పగలు—ఒక రియొస్టాట్ తిప్పినట్టుగా నాటకశాలలోని దీపాలలాగా వెలుగువస్తుంది. రోదసీ దినాలు ఒకటి తరవాత ఒకటి వెళ్ళి పోయాయి.

చెయ్యవలసినవి చాలా పనులున్నాయి : ఓరియెంటేటర్ రీడింగుల్ని సరిచూడడమూ, పుస్తకంలో వ్రాయడమూ, రేడియో ప్రసారం దూరాన్ని పరిక్ష చేయడమూ, మామూలుగా నిద్రపోవడం మొదలుకుని, భోజనం చేయడం వరకూ రోదసి మీద మరింతగా ఆధిపత్యాన్ని సాధించడంకొరకు గొప్ప ప్రాముఖ్యం గల చాలా వైజ్ఞానిక ప్రయోగాల్ని చేయడమూ.

డజన్లకొలదీ సిద్ధాంతాల్ని ధృవపర్చాలి, లేదా తప్పని నిరూపించాలి; యిదే రోదసిలో మొదటి దీర్ఘ యాత్ర కాబట్టీ, అప్పటికున్న సమాచారాన్ని సరిదిద్ది, కొత్త సమాచారాన్నీ, బహుశా మరింత ఎక్కువగా సాధారణ సమాచారాన్నీ అందజెయ్యవలసి వుంది గాబట్టీ.

సుమారు నాలుగేళ్ళ క్రితం విజ్ఞాన శాస్త్రజ్ఞులకు, రోదసీ పరిస్థితులలో ఉత్పన్నంకాగల కొన్ని జీవశాస్త్రం సంబంధమైన విశేషాల గురించి అంత స్పష్టమైన అభిప్రాయం లేదు. అన్నిటికంటె ముఖ్యంగా, గంటల తరబడిని మనిషి భారరాహిత్యాన్ని ఎలా తట్టుకుంటూన్నదీ, రోదసీ నౌకా చోదకుడు మామూలుగా వుంటూ పనిచెయ్యగలడా అన్నదీనీ. భారరాహిత్యం అంటే వింతయిన పరిస్థితులూ, భావనలూ కలగడం మాత్రమే కాదు. ఈ స్థితిలో మనిషికి తన శరీరపు బరువు లేకుండా పోతుంది, పాదాలు పైకప్పువేపుకు వుండగా నిలబడగలుగుతాడు, రోదసిలో వేలాడుతూనో ఈదుతోనూ వుండగలుగుతాడు.

ఇదుగో మచ్చుకొకసమస్య, భారరాహిత్య పరిస్థితులలో మామూలు

ఆహారాన్ని తినడం. రోదసిలో దూరాలకు వెళ్ళడానికి మేము సిద్ధపడుతున్నాము, అంచేత యీ విషయం ముఖ్యమైనది. రస్కులు, బిస్కొత్తులు వంటి తునకలు పైకెగిరిపోయే పదార్థాలు పనికిరావన్నది స్పష్టమే. అవి తునకలయిపోతాయి, యివి శ్వాసకోశంలోకి ప్రవేశించవచ్చును. ఆహారం కడుపులోకి దిగుతుందా, దానికేమీ బరువు లేకపోతే? ఒక్కమాటలో చెప్పాలంటే ఎన్నో సమస్యలున్నాయి. వాటన్నిటికీ జబాబు చెప్పవలసివుంది.

కొన్ని ఆహార సమస్యలను విజ్ఞాన శాస్త్రజ్ఞులు పరిష్కరించారు. ట్యూబుల్లోంచి బాగా తినడం సాధ్యమే. ఇకవున్న సమస్య దానిలోని కాలరీలు, రోదసీ ఆహారపు రుచి. అక్కడా రోదసిలో తింటూ, ఒక కొత్త వృత్తి, అంటే రోదసీ పాకశాలలో వంటపనివాని వృత్తి ఒకటి సృష్టి అవుతుందనుకున్నాను. ఎంచేతనంటే ప్రసిద్ధమయిన తూర్పు దేశాలవీ, ఫ్రెంచివీ మొదలైన వంటకాలు రోదసిలో పనికిరావు. ముందరిలాగానే, వాటిని భూలోకంలో ఏలుబడి సాగించమనండి.

భారరాహిత్య స్థితికి నేను పూర్తిగా అలవాటు పడిపోయిన తరవాత, ఐదవ ప్రదక్షిణంలో నాకు ఇబ్బంది కలిగించే అనుభవం కలిగింది. నాకు పదేపదే డోకు వచ్చేటట్టు వుండేది. "పెంకితనం" చేస్తోన్న నా కుహరిక వ్యవస్థను నెమ్మదించడానికి నేను జాగ్రత్తగా కుర్చీలో ఎక్కువ సదుపాయంగా వుండేటట్టు కూచున్నాను. తరవాత నాకు స్పృహతప్పింది. డోకు క్రమక్రమంగా తగ్గింది, పరిస్థితులు నయమయ్యాయి బాగా...

నాకు వెనుక రెండు లక్షల నాలుగు వందల కిలోమీటర్లున్నాయి. కాస్త విశ్రాంతి తీసుకున్నాను. స్వయంచలనక నియంత్రణ నుండి శారీరకమైన నియంత్రణకు మార్పుచేసి, యించుమించు ఐదు టన్నుల బరువున్న నా రోదసీ యంత్రానికి గల "ఎగిరే" గుణాలను రెండోసారి పరిక్ష చేయడం ప్రారంభించాను. నౌక గమనాన్నీ, స్థానాన్నీ నా చేతి కదలికలకు లొంగి మార్చుకునేది, బాగా నిర్మింపబడిన, సుళువుగా నియంత్రించబడే పైటర్ విమానం చక్రం వద్ద నేను కూచుని వున్నట్టుగా. ఈ సంతృప్తికి దోహదం

చేసినట్టుగా రేడియో యూరీ గగారిన్ దగ్గరనుండి ప్రేమపూర్వకమైన ఒక టెలిగ్రామును తీసుక వచ్చింది. అప్పుడాయన కెనడాలో వున్నారు, సైరస్ ఈటన్ వద్దకు వెళ్ళారు. "ఉండవయ్యా! రేడియో నా జవాబును పంపడం ముగించే లోగా కిటికీలో నుండి మీ వేపు నేను చేతిని ఊపుతూ వుండ వచ్చును...మీరు నన్ను చూడగలుగుతారా?" అని అనుకున్నాను, ఓస్తోక్-2 కెనడా పరిసరాలలో వెళ్తూ వుండడం వల్ల. అయితే, "దృశ్య" అభినందన పైని ఆధారపడకుండా, నేను "కృతజ్ఞు"ణ్నని రేడియోమీద పంపించాను.

కాబిన్‌లో ఒత్తిడి మామూలుగా వుంది, చెమ్మ ఆరోగ్య మందిరంలో వున్నట్టుగా వుంది, ఉష్ణోగ్రత 65 ఫారెన్ హీట్ డిగ్రీలుంది. మంచి సదుపాయంగా వుంది! "అద్భుతమైన విమాన"మని అనుకున్నాను, దీనిని నిర్మించి, ముందుగానే ప్రతి సదుపాయం గురించీ ఆలోచించిన వాళ్ళకు కృతజ్ఞతను చూపుతూ.

తరవాత మాస్కో వాసులకు "గుడ్ నైట్" పంపుతూ, నా కుర్చీలో యింకా సదుపాయంగా పడుకుని, నిద్రపోవడానికి ప్రయత్నించాను.

నా నిద్ర బాగానే వుంది, నేను చాలాసార్లు మేలుకున్నప్పటికీ. భార రాహిత్యం నా మీద గమ్మత్తులు చేస్తూనే వుంది. చాలా సేపటివరకూ నా చేతుల్ని ఎలా పెట్టుకోవాలో నాకు తెలియలేదు. నేను నిద్రపోవడం మొదలు పెట్టానో లేదో అవి లేచి గాలిలో వేలాడుతూ వుండేవి. ఆ విధంగా నిద్ర పోవడం నా కలవాటు లేదు. నా చేతుల్ని కాస్త అదుపులో పెట్టుకునేందుకు, కుర్చీ బెల్టుకింద వాటిని పెట్టాను. అప్పుడు మాత్రమే నాకు గాఢమైన నిద్ర పట్టింది. నేను మేలుకునే టప్పటికి నా చేతులు మళ్ళీ గాలిలో వున్నాయి. చేసేదేముంది?

నాలుగు లక్షల పదివేల కిలోమీటర్లు నా వెనుకనున్నాయి. నేను తిన్నగా చంద్ర లోకానికి వెళ్తున్నట్టయితే, నేనప్పటికే అక్కడ వుండి వుండేవాణ్ని.

పదమూడు, పద్నాలుగు ప్రదక్షిణలయ్యేసరికి, నేను పూర్తిగా భార

రాహిత్యానికి అలవాటు పడిపోయాను, నాకున్న కొద్ది విశ్రాంతి సమయాల్లో కొన్వాస్ సినిమా కెమారాతో భూమి చిత్రాలను తీయాలనుకున్నాను. మన భూమి చాలా అందంగా వుంటుంది! ప్రతి మలుపులోనూ కొత్త రంగులు, కొత్త దృశ్యాలు, అలేఖ్యమైన సౌందర్య విలాసం. ఖండాల, పర్వతాల, అడవుల రే ఖ లు స్పష్టంగా చూడవచ్చును, గుడ్డ పీలికల్లా మహా నదులు, మెరుస్తోన్న సముద్రాలూ, పెద్ద సరస్సులూ.

భూలోకపు దినం ముగియ వస్తున్నది. ఇక భూమికి దిగడానికి వేళయ్యింది.

ఆజ్ఞ వచ్చింది, నౌక తన తోవను మార్చుకుంది; తొందరపాటు లేకండా. అంతా నిశ్శబ్దం. విడదీసే యంత్ర వ్యవస్థను నడిపించినప్పుడు, గాలిలో "ఎగురుతోన్న" వస్తువులు చడీ చప్పుడూ చేయకండా నా పాదాల దగ్గర పడివున్నాయి, ఏదో తర్ఫీదు చేసినట్టు, సి నీ మా కెమేరా, వ్రాత పుస్తకమూ, పెన్సిలూ, ఎక్స్‌పోజర్ మీటరూ. అవికూడా అనుకున్నాయి, త్వరలో భూమికి దిగిపోతామనీ, అకారణంగా "ఎగరడం" అక్కడ నిషిద్ధ మనీ. వాతావరణం రాపిడికి చర్రం వేడెక్కిపోయింది. తేజస్సులో వెలిగి పోతోన్న జ్వాల నాకు చుట్టూరా వుంది; ప్రధాన డిజైనరునూ, సాంకేతిక మైన పై పూతల విషయంలో ఆయనకు గల అచంచలమైన విశ్వాసాన్నీ జ్ఞాపకం తెచ్చుకోకుండా వుండలేకపోయాను. విడదీసే యంత్ర వ్యవస్థ సరిగ్గా పని చేసింది. భూమికి కొద్ది కిలోమీటర్ల దూరం వుందనగా, నేను నేలకు దింపే యంత్ర వ్యవస్థను నడిపేను.

భూమి. అది మెల్లగా, మెలమెల్లగా వచ్చింది. పైనుండి నేను నా నౌకను చూశాను. అది కొద్ది సెకండ్లు ముందుగా వచ్చింది. నన్ను గాలి నన్ను ఒక వేపుకు తీసుకవెళ్ళిపోయింది. ఇప్పుడు మా మధ్య రైలు రోడ్డు గట్టొకటి వుంది. దబ్, నేను నా కాళ్ళమీద నిలబడ్డాను. ముగ్గురు మోటారు సైకిలిస్టులు వచ్చారు, పూర్తి వేగంతో. "మీరు తితోవా ?"

"నేను తితోవ్‌ను."

"భలే, భలే తితోవ్ !"

భూమిమీద తొలి సంభాషణకు వెంటనే అంతరాయం కలిగింది. రెండు కార్లు దూసుకవచ్చాయి. ఒకావిడ ఒక దాంట్లోంచి గంతింది, ఆమె నౌసటిమీద నెత్తురు.

"మీకేం జరిగింది ?" అని అడిగాను.

"అదేమీ లేదు. మేమొక గోతిలో పడ్డాము. ముఖ్యమైనదేమిటంటే —నేను మొదట మిమ్మల్ని చూశాను."

ఆడవాళ్ళు, మన ప్రియమైన భూలోకపు ఆడవాళ్ళు. ఆవిడేనట నన్ను మొదట చూసింది. ఆ ముగ్గురు మోటారు సైకిలిస్టులూ లెక్కలోకి రారు. ఆ కొత్తవాళ్ళు, నా రోదసీ దుస్తులను తీసివేసుకోవడానికి నాకు సాయపడ్డారు. నన్ను నౌక దగ్గరికి తీసుకవెళ్ళారు. నేను నా సినీమా కెమేరానూ, వ్రాత పుస్తకాన్నీ కేబిన్‌నుండి తీసుకున్నాను, నౌక చుట్టూరా చూశాను. ఒక్క లొత్తలేదు, రూపు చెడలేదు. కేబిన్లోని పరికరాలూ, సామగ్రీ కుదురుగా వున్నాయి. నౌక యింకోసారి బయలుదేరడానికి సిద్ధంగా వుంది.

అనాలోచితంగా నా రోదసీ యాత్రిక మిత్రుణ్ని అభిమానంగా తట్టి, నన్ను టెలిఫోను దగ్గరకు తీసుకవెళ్ళమన్నాను.

యాత్రా సమయంలో నేనేమి ఆలోచించాను ?

నేనీ ప్రశ్న విన్నాను, నాకు నేనే అడిగాను, ఒక వందసార్లు. ఇప్పుడు నూట ఒకటోసారి జబాబిస్తున్నాను, నాకూ, ఆసక్తిగల ఎవరికేనా సరే : నేను పని చేస్తున్నాను, దీర్ఘాలోచనలకు నాకు సమయంలేదు. భూమిమీద లాగే మనిషి రోదసిలోనూ జీవించగలడు, పనిచెయ్యగలడని నా కృషి ముఖ్య ప్రశ్నకు జబాబు యిచ్చినందుకు నేను సంతోషిస్తున్నాను.

# మనిషీ, అతని కీర్తి

1961 సెప్టెంబరు 11న నాకు యిరవై ఆరేళ్ళు. కాని యిప్పుడీ "జన్మ దినం" బహుశా పదిహేడురోజులు వెనుకకు నెట్టవలసి వుంటుంది. ఎంచేత నంటే ఒకరోజున మన భూమిమీద జీవితంలో పదిహేడు రోజుల్ని అందు కున్న మొదటి వ్యక్తిని నేనే గనక; యిరవై ఐదు గంటల్లో నేను పదిహేడు సార్లు ఉదయాలనూ సూర్యాస్తమయాలనూ చూసి, వాటి ననుసరించేను గనక.

ఆ రోజు చాలా పొద్దుటనుండీ, తమారా యింట్లో పనులు చక్క బెడుతూ వుంటే, నేను ఉత్తరాలు, కార్డులు, అభినందనల టెలిగ్రాములూ స్నేహితుల నుండి, కొత్తవారి దగ్గర్నుండీ వచ్చినవాటినీ, విద్యార్థులనుండీ, వృద్ధులనుండీ వచ్చిన వాటినీ చదివాను. వాటిలో విదేశాలనుండి వచ్చిన టెలి గ్రాములుకూడా వున్నాయి; పత్రికలనుండీ, సంస్థల నుండీ వచ్చిన ప్రశ్నలు డజన్లకొద్దీ ఉన్నాయి. వాటిలో ఒకటి నాకు ఆసక్తిని కలిగించింది.

తమారా వినేలాగ ప్రశ్నలను బిగ్గరగా చదవడం మొదలుపెట్టాను :

"మీ భార్యకూ, మీకూ వున్న సంబంధాలెటువంటివి ?"

"నాభార్య నడగండి ఆ విషయం !" వంటింట్లోంచి అంది ఒక ఉల్లాసమైన గొంతుక.

"మీకిష్టమైన వంటకం ఏది ?"

గోడకవతల కాస్త నిశ్శబ్దం. "వారికి చెప్పండి—పొలంలోంచి దొంగలాడిన దోసకాయలు, సైబీరియన్ మాంసపు కూర, మా ఆవిడ వండిన ప్రతి ఒక్కటీ."



వీర సోవియట్ నౌకా చోదకుడు గెర్మన్ తితోవకు
మాస్కో వాసుల అభినందనలు

కోపం వచ్చినట్టుగా నేను నటించి "తమారా! నువ్విది సరిగా అర్థం చేసుకోవడం లేదు. ఇది నా పుట్టిన రోజుగాని నీది కాదు. మన జవాబులు నిన్ను పొగుడుతున్నాయేగాని నన్ను కాదు."

ఇక నేను మాటాడకండా పూరుకున్నాను. ఇంకో ప్రశ్న: "ప్రపంచ ప్రసిద్ధుడవడం మీకు ఎలా వుంది?"

"మళ్ళీ చెప్పండీ!"

నేనా ప్రశ్న మళ్ళీ చెప్పాను. కాని మా ఆవిడ వూరుకుంది. ప్రపంచ ప్రసిద్ధుడవడం మీకు ఎలావుంది?

నేను సుళువుగా దీనికి జవాబు చెప్పగలననుకోండి: నాకు బాగుంది. కాని యిప్పటికే యీ జవాబు నాకు సంతృప్తిని యివ్వడంలేదు. ఈ ప్రశ్న అడిగిన వాళ్ళకూ బహుశా యీ జవాబు సంతృప్తినిచ్చి వుండదు. నానుంచి వాళ్ళకు కావలసింది యింకొకటీ.

నిరపాయకరంగా కనిపించే యీ ప్రశ్నలో, మా సోవియట్ వాస్తవిక స్థితి గురించీ, మా సోవియట్ ప్రజల గురించీ దృక్పథంలోనే చెడు ఏదో వుంది. ఈ ఉత్తరం రాసిన అతనిని నేను నిందించదల్చుకో లేదు. ఈయన బూజెక్కిన ప్రశ్నే నన్నడిగారని స్పష్టమే. ఎవరినైనా, ప్రపంచ పోటీలో గెలిచిన ఒక బాక్సర్‌నో, యిరవై అంతస్తుల మేడ పైకప్పు నుండి పడిపోయి అదృష్టవశాత్తూ మెడ విరక్కుండా తప్పించుకున్నతన్నో అడిగి వుండేవారాయన యీ ప్రశ్నను.

నా అభిమాన గ్రంథాల్లో ఒకటి, వీర వైమానికుడు మెరెస్యేవ్ గురించి వున్న పుస్తకం. యుద్ధం మొదట్లో ఆయనకు కాళ్ళు రెండూ పోయాయి. అయినా కృత్రిమమైన కాళ్ళతో ఆయన ఫాసిస్టులతో పోరాడుతూనే వున్నారు. ఈ కథకు, నూరెంబర్గ్‌లో యుద్ధాపరాధుల విచారణకూ కొంత సంబంధం వుంది.

గొయెరింగ్ పరిక్ష చెయ్యబడుతున్నాడు. ప్రాసిక్యూటర్ అతనిని "సోవియట్ దేశం పైని ద్రోహబుద్ధితో దాడి చెయ్యడం ద్వారా—దీని ఫలి



యూరీ గగారిన్, గెర్మన్ తితోవ్

తంగానే జర్మనీ అణచివెయ్యబడింది—మీరు ఘోరాతిఘోరమైన నేరం చేశారని ఒప్పుకుంటారా?" అని అడిగారు.

గొయరింగ్ గుల్ల గొంతుకతో జవాబు చెప్పాడు: "అది నేరం కాదు. అది ఘోరమైన పొరపాటు. నేను ఒప్పుకునేదల్లా మేము నిర్లక్ష్యంగా ప్రవర్తించామనే. ఎంచేతనంటే, యుద్ధంలో వెల్లడి అయినట్టుగా, మేమెరగనివి చాలా వుండేవి; మేము అనుమానించనైనా అనుమానించనివి చాలా వుండేవి. అన్నిటికంటె ముఖ్యమైనది, సోవియట్ రష్యన్ గురించి మాకు తెలియదు, లేదా మేము వాళ్ళను అర్థం చేసుకోలేదు. వారు అప్పుడూ, యిప్పుడూ చిక్కు సమస్యగానే వున్నారు. ఏ పత్తేదారీ శాఖ కూడా, సర్వోత్తమమైనది సైతం, సోవియట్ల సైనిక శక్తిని వెల్లడి చెయ్యలేక పోయింది. నేను ఫిరంగులు, విమానాలు, టాంకులు సంఖ్యను గురించి కాదు చెపుతున్నది. అది మాకు సుమారుగా తెలుసు. పారిశ్రామిక బలం గురించి

గాని, గమనంగురించి గాని నేను చెప్పడం లేదు. నేను ప్రజల గురించీ చెప్తున్నాను. రష్యన్లు ఎల్లప్పుడూ విదేశస్తులకు విడదియ్యరాని చిక్కు సమస్య గానే వుంటున్నారు."

గెయరింగ్ ఒప్పుకోలుకూ, పాశ్చాత్య విలేకరి ప్రశ్నకూ సంబంధమేమిటా అని ఎవరేనా ఆశ్చర్యపడవచ్చును. అయినా వాటికి సంబంధం కొంత వుంది. గొయరింగ్‌కు చిక్కు సమస్యగా వుండిపోయినది, యింకా యీ నాటి వరకూ చాలమందికి చిక్కు సమస్యగానే వుండిపోయింది. లేకపోతే యిటువంటి ప్రశ్నను వాళ్లు అడిగివుండేవారు కాదు. ఇంకో విధంగా అయినట్టయితే, కొందరు పాశ్చాత్య సేనానాయకులనుండీ, పౌరులనుండీ సోవియట్ దేశానికీ, సోవియట్ ప్రజలకూ వ్యతిరేకంగా బెదిరింపులు యీ నాడు మనం వినివుండేవాళ్ళం కాదు. సోవియట్ మానవునిలోని సారాంశాన్ని—యీ విధంగా నేను చెప్పవచ్చనుకుంటాను—తెలుసుకోలేకపోవడం; మా దృక్పథాన్నీ, భావాలనూ, లక్ష్యాలనూ అర్థం చేసుకోలేకపోవడం మమ్మల్ని అర్థం చేసుకోదల్చుకోని వారికే ఎక్కువగా కీడు చేస్తుంది.

పాశ్చాత్య దేశాలకు అలవాటయిన తీరు ప్రచారం మాకు సరిపోయేది కాదు.

విషయమేమిటంటే, రోదసీ నౌక ఓస్తోక్-2 వాస్తవానికి, ప్రపంచంలో తొలి రోదసీ నౌకలను సృష్టి చేయడానికి తమ జ్ఞానాన్ని, కృషినీ అర్పించిన అనేక వేలమంది ప్రజలు సమిష్టిగా కష్టపడి చేసిన వైజ్ఞానిక శ్రమ ఫలితం. నిజంగా మరీ ముఖ్యమైనది కాకపోయినా, ప్రముఖమైన పాత్రను నేను నిర్వహించవలసి వచ్చింది. జరిగిన మొత్తం పనితో పోల్చితే నా పాత్ర మరీ ముఖ్యమైనది కాదు. ఈ పనిని నెరవేర్చిన వారి పేరు యింకా తెలియవు, కాని వారు నిజమైన శ్రమ వీరులు. అంచేత "నాయక" పాత్రను ధరించడమంటే, నా సేవకంటె ఎంతో అధికమైన సేవ చేసిన వేలాది మందిని కాదనడమే అవుతుంది; మా దేశానికి కీర్తిని తెచ్చిన వారిని అవమాన పర్చడమే అవుతుంది.

ఈ యాత్రకు సన్నాహ మవుతున్నప్పుడు, మేమొక సాహస కృత్యాన్ని చెయ్యాలని ఆలోచన చెయ్యలేదు. నాకేగనక అది మనసులో వున్నట్టయితే, నాకీ యాత్ర పనిని అప్పగించి వుండేవారు కాదు, రెండవ రోదసీ నౌకా చోదకుడు కావడానికి నాకు నైతికంగా హక్కు వుండేది కాదు. మేమంతమందిమీ దీన్ని మా హృదయాల్లో గుర్తించి, పనికోసమూ, తప్పని సరి అయిన, మా జీవితానికి ముఖ్యమైన పనికోసమూ మాత్రమే సన్నాహ మయ్యాము.

మాకు గౌరవం వస్తుందని మేము గుర్తించామనుకోండి. కాని యింత బ్రహ్మాండమైన ఎత్తున వస్తుందని—కచ్చితంగా చెపుతున్నాను—మేమెన్నడూ కలయినా కనలేదు. ఎంచేతనంటే—నేను మళ్ళీ చెపుతున్నాను—రోదసీ నౌకలను సృష్టించిన విజ్ఞాన శాస్త్రవేత్తలు, ఇంజినీర్లు చేసిన పనికంటె మా యాత్ర గొప్పదని మేము అనుకోలేదు గనక.

మా దేశంలో ఘన కార్యాలు చేయడం జీవితానికే మూలం. దేశభక్తి ప్రపూరిత యుద్ధ చరిత్రను మీరు తిప్పి చూసినట్టయితే, మా దేశీయులు రోజురోజుకూ, గంటగంటకూ, నిమిష నిమిషానికీ ఘన కార్యాలు చేయడం మీకు కనిపిస్తుంది. తన శరీరాన్ని ఫిరంగి కన్నానికి కప్పివేసి, తన మరణాన్ని మూల్యంగా చెల్లించి యుద్ధరంగంలోని ఒకచిన్న విభాగంలో విజయాన్ని కొని పెట్టిన యువ కమ్యూనిస్టు సంఘం సభ్యుడు అలెక్సాందర్ మాత్రొసోవ్ మీకు జ్ఞాపకం వున్నాడా ? వందలూ, వేలూ వీరులు అటువంటివారున్నారు. పార ఛూట్ మీద నుండి దిగిపోవడానికి బదులు ఫాసిస్టుల టాంకుల్లోకి తన చెడిపోయిన డైవ్ బాంబర్‌ను దూసుకపోనిచ్చిన కమ్యూనిస్టు వైమానికుడు గేస్టెల్లో వున్నాడు. బ్రెస్ట్ దుర్గం సైనికులున్నారు. గెస్టపో పెట్టిన ఘోర హింసలతో మరణించారేగాని, మా దేశం కొరకు పోరాటంలో తమ మిత్రుల పేర్లను బయటపెట్టని వీరగెరిల్లా యోధులున్నారు. తమ స్వంత కీర్తికోసమేనా, వీరు యీ ఘన కార్యాలు చేసింది ? రోగులమీద కాకుండా తనమీదే ప్లేగు వాక్సీన్‌ను ప్రయోగించుకున్న సోవియట్ వైద్యుడు బోరిస్

వస్తుఖోవ్‌ను మేము గౌరవిస్తాము. అంటార్కిటిక్ యాత్ర కష్టపరిస్థితుల్లో తనకుతానే అపెండిసిటిస్ ఆపరేషన్ చేసుకున్న సోవియట్ వైద్యుడు లియొనిద్ రొగొజోవ్ వీరత్వానికి మేము యీర్ష్య పడతాము.

ఒకొక్కప్పుడు వీటిగురించి నాలో నేను ఆలోచించుకుని, యింత గొప్ప పనులు చేయగలనా అని నన్ను నేను ప్రశ్నించుకుంటే, దీనికి ఎన్నడూ నేను సంతృప్తికరమైన జబాబు యిచ్చుకోలేక పోయాను—యీ పరిస్థితులలో చేతనైనంత చెయ్యడానికి ప్రయత్నిస్తానని చెప్పుకోవడం తప్పితే.

సముద్రంతో నలభై తొమ్మిది రోజులు పోరాడి; చివరిక్షణంవరకూ మానవులుగా, సోవియట్ ప్రజలుగా తమ ఆత్మగౌరవాన్ని కోలుపోవని సైనికుడు జిగన్‌షిన్ పట్ల, అతని ముగ్గురు స్నేహితుల పట్లా మా కెంతో గౌరవం. విమానవాహక నౌక కియర్ సర్జి వద్దకు హెలీకాప్టర్‌మీద వెళ్ళిన ఒక అమెరికన్ పత్రికా రచయిత "మీరెంటువంటివాళ్లో మీకు తెలుసునా?" అని అడిగితే, కృశించిపోయి సగం చచ్చివున్న జిగన్‌షిన్ "సామాన్య సోవియట్ ప్రజలం" అని మామూలుగా జబాబు చెప్పారు.

తాము అపూర్వ వీరులమనీ, మానవాతీతులమనీ ప్రజలకు ఎవరేనా నచ్చచెప్పాలా, నచ్చచెప్పగలరా? నేను ప్రజలలో పుట్టాను, వారి మధ్య పెంచబడ్డాను. కిప్లింగ్ అన్నట్టు వారి నీరు తాగాను, వారి ఉప్పు తిన్నాను —నా దేశీయుల, నా అన్నల, నా తలిదండ్రుల, నా కమ్యూనార్డ్ తాతల ఉప్పు.

ఓస్తోక్-1, ఓస్తోక్-2 యాత్రలకు మధ్య కాలంలో మా దేశంలో బ్రహ్మాండమైన ఘటనలు జరిగాయి. కమ్యూనిజం నిర్మాణం లక్ష్యంగా గల మా పార్టీ కార్యక్రమాన్ని మేము చదివాము. హృదయపూర్వకంగా మేము దానిని ఆమోదించాము, ఏమి జరిగినా సరే మేము దానిని అమలు జరుపుతాము. అది కూడా ఒక ఘనకార్యం అవుతుంది. ఘనకార్యమే, అయితే ఎవరిది? మనిషి మనిషికి స్నేహితుడు, సోదరుడూ అన్న కమ్యూనిజం మహత్తర సూత్రాన్ని అనుసరించి జీవిస్తోన్న యావత్తు సోవియట్ ప్రజలదీ

అవుతుంది, యీ ఘనకార్యం.

ఒక కుర్రవాణ్ని కాపాడడానికి రైలు ఎదుటకు పరుగెత్తి, చక్రాల కింద పడకుండా అదృష్టంకొద్దీ బయడపడిన ఒక సోవియట్ పౌరుడు, మహా అయితే ఆ తుంటరి కుర్రవాణ్ని ఒక్కటివేసి వాణ్ని తలిదండ్రుల వద్దకు తీసుకవెళ్ళి తన తోవను తాను పోతాడుగాని, బహుమానం గురించీ, కీర్తి గురించీ, లేకపోతే సంభ్రమాశ్చర్యాలు కలుగుతాయనీ ఆలోచించడు. ఈ విధంగా మా ప్రజలు శిక్షణను పొందారు.

నాకు వచ్చిన అన్నిటికంటే గొప్ప గౌరవం, కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ నన్ను తన శ్రేణులలోనికి తీసుకోవడానికి నిర్ణయించడం.

రోదసిలో నా దీర్ఘ యాత్రలో నా అభ్యర్థిత్వ కాలాన్ని నేను గడిచినట్టుగా పరిగణించవచ్చుననీ, నేను పార్టీ సభ్యత్వానికి అర్హుణ్ననీ అన్నారు నికితా సెర్గియేవిచ్ కృశ్చేవ్ తన ప్రకటనలో. ఆ సిఫారసు నన్నెంతో కదిల్చివేసింది, అందుకు నేను గర్వపడ్డాను. మర్నాడు నేను యింటికి వెళ్ళి పత్రిక విప్పి నన్ను పార్టీలోకి చేర్చుకోవాలన్న కేంద్ర కమిటీ నిర్ణయాన్ని చదువుతూ వుంటే నా చేతులు ఆశ్చర్యంతోనూ, ఉద్రేకంతోనూ వాలిపోయాయి. నేనిది ఊహించలేదు, కలలో కూడా అనుకోలేదు.

ఇతర దేశాలు దొంగతనాలు, హత్యలు, మానభంగాలు, కారు ప్రమాదాలు గురించి జాగ్రత్తగా లెక్కలు వుంచినట్టుగా, మా దేశం మా ప్రజల వీరకృత్యాల గురించీ, గౌరవకరమైన కార్యాల గురించీ లెక్కలు వుంచనందుకు నేను విచారిస్తున్నాను. అయితే యిరవై కోట్లమంది గల ప్రజల ఘనకార్యాల వ్రాసి వుంచడం నిస్సందేహంగా చాలా కష్టం. ఇవ్వన్నీ యదాలాపంగా చెయ్యబడినవే.

అంచేతనే ప్రజలు నాలో విశ్వాసం వుంచినందుకు నేను గర్విస్తున్నాను, దాన్ని సఫలం చేసినందుకు సంతోషిస్తున్నాను.

ఈ కీర్తి "భారాన్ని" నేనెలా మోస్తున్నానన్న దాన్నిగురించి, నేను చెప్పగలిగేదింతే.

నన్నీ ప్రశ్నను అడిగినవారు నా జవాబును అర్థం చేసుకుంటారో

చేసుకోరో నాకు తెలియదు. ఎంచేతనంటే యిటువంటి ప్రశ్నలను తయారు చేసిన వాళ్ళను తరచు నేను అర్థం చేసుకోలేక పోతున్నాను.

ప్రపంచంలో చాలా ఎక్కువమంది శాంతిని కోరుకుంటున్నారని నా విశ్వాసం. నికితా సెర్గియేవిచ్ కృశ్చేవ్ ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీలో, మనమంతా ఒకేఒక గ్రహంమీద జీవిస్తున్నామనీ, మనం పరమాణు ఆయుధాలతో చెలగాడటానికి మన భూమి చాలినంత పెద్దది కాదనీ జ్ఞాపకం పెట్టుకోమని, యుద్ధాన్ని ప్రేమించేవారంతమందికీ హెచ్చరిక చేశారు, నిరాయుధీకరణ కొరకు చరిత్రాత్మకమైన పథకాన్ని ప్రతిపాదిస్తూ.

నేను చూశాను దానిని, మన భూమిని, నేను దాన్ని బాగా చూశాను. అది బహు అందంగా వుంది, కాని అది నిజంగా చిన్నది, రోదసిలోంచి చూస్తే. భూమిని నేను చూసినట్టుగా అక్కణ్నుండి చూడడం జ్ఞాపకానికి వస్తోంటే, భూమిమీద ఏ చోటికైనా నా నౌకను నడపగలనని నాకు తెలిసి వుండగా, మనం దాని విషయమై ఎంత జాగ్రత్తగా వుండాలో, ఆరు ఖండాలలోనూ శాశ్వతంగా శాంతి విలసిల్లడానికి మనం ఎలా పాటుపడాలో ఎలా యోచించాలో హటాత్తుగా గ్రహించాను నేను సర్వేంద్రియాలతోనూ.

నా యాత్రను సాగిస్తూ నేను ఓస్తోక్-2ను ఓల్గా స్టెప్పీలమీదికి దించి వుండి వుండేవాణ్ని, లేదా ఇయోవాలోని కోటీశ్వరుడు గార్స్ట్ మొక్కజొన్న పొలాలలోనికో, మలయాలోని చెరకు తోటలోనికో, ఆస్ట్రేలియన్ గొర్రెల కాపరి పచ్చిక బయళ్ళలోకో దించి వుండేవాణ్ని. మా దేశంలో, సరతోవ్ జిల్లాలో ఓస్తోక్-2 ను ప్రజలు ఎలా అభినందించి వుండేవారో, అలాగే ప్రతిచోటా ప్ర జ లు అంత ఆదరంగా అభినందించి వుండేవారు. ఎంచేతనంటే ఎంత అనుమానం వున్న పత్తేదారైనా, ఏ విధంగానైనా యుద్ధానికి ఉపయోగించడానికి వీలుపడేదేదీ దాన్లో అతనికి కనిపించేది కాదు.

నేనింకో విషయాన్ని చెప్పదల్చుకున్నాను. రోదసిలో ఎగిరి వెళ్ళడానికి; రోజులూ, వారాలూ, నెలలుసైతం, ఉదాహరణకు అంగారక గ్రహానికి ఎగిరి వెళ్ళడానికి మనిషికి వుండవలసిన గుణాలనుగురించి వివిధ సిద్ధాంతాలు రోదసీ నౌకా చోదకులమైన మాకు తెలిసినవే. అక్కడికి వెళ్ళడానికి

259 రోజులు పడుతుందనీ; మామూలు జీవితపద్ధతి లేకపోవడంవల్ల, తాను ఒంటరిగా ఏకాకిగా వుంటున్నానని తెలిసి వుండడం చేతా మనిషి ఆ కాలంలో తబ్బిబ్బవుతాడనీ శాస్త్రజ్ఞులు అంచనా వేశారు. అందుచేతనే కొంతమంది "సిద్ధాంత కర్తలు", రోదసీ నౌకా చోదకులు కొద్దిపాటి అవసరాలు గల "సంకుచిత మనస్కులు" అయి వుండాలంటూ సూచించారు.

దీర్ఘ కాల యాత్రా సమయంలో మనిషి ముఖ్య శారీరక గమనం మందగించ చేయబడాలనీ; అతని మానసిక గ్రాహ్యత, కార్యాలూ కనీస పరిమితికి తగ్గింపబడాలనీ—యీ విధంగా కూడా ఒక "సిద్ధాంతం" వుంది. ఇంకో మాటల్లో చెప్పాలంటే, రోదసీ నౌకా చోదకుణ్ని ఒక మాదిరీ మత్తు స్థితికి దించాలనీ, ఆ విధంగా ఒక జీవచ్ఛవాన్ని నక్షత్రాల వద్దకు పంపాలనీ అర్థం. అయితే అటువంటప్పుడు రోదసిలోనికి మనిషినే ఎందుకు పంపాలి? అతనక్కడ ఏమి చూస్తాడు; ఏమి తెలుసుకుంటాడు? అతను భూమికి తిరిగి వచ్చేటప్పుడు ప్రజలకు ఏమి తీసుకవస్తాడు?

మమ్మల్ని రోదసీ యాత్రలకు సిద్ధపరుచుతూ మా విజ్ఞాన శాస్త్రజ్ఞులు దీనిని ప్రచారంకోసమో, జూదంకోసమో చేయడం లేదని సోవియట్ రోదసీ నౌకా చోదకులమైన మాకు బాగా తెలుసు. మత్తు మందుతోనో నిద్రమందుతోనో మందగించబడని మానవ హేతుకత—మా యాత్రలలో వున్నదిదే. హేతుకత అన్వేషణా బుద్ధి గలది; మానవుడు చక్రాన్ని సృష్టి చేసిన నాటినుండీ దానికి మానవ జ్ఞానమూ, విజయాలూ ఆయుధాలు. విశ్లేషణం, పరిశీలన, నిర్ణయం చేయగల హేతుకత.

రోదసీ నౌకా చోదకులైన నా మిత్రులు యావన్మందీ, సరిగ్గా యిటువంటి యాత్రలకోసమే సిద్ధమై వున్నారు—దీనిని "స్వంత ప్రచారం"గా లెక్క కట్టకూడదని ఆశిస్తున్నాను. దేని యాత్రా సమయంలో నయితే నేను నవ రోదసీ యుగపు మరపురాని పదిహేడు ప్రభాతాలను దర్శించానో, ఆ ఓస్తోక్-2 యాత్ర కూడా యిందుకోసమే జరిగింది.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA124B116 |
| పుస్తకం పేరు | గెర్మన్ తితోవ్ |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 117 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 2,116 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | APSar |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Ch.Ramya |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |